# సత్యహరిశ్చంద్ర

నాటకం 1924



బలిజేపల్లి లక్ష్మీకాంతము

# సత్యహరిశ్చంద్ర

నాటకము. రచన . బలిజేపల్లి లక్ష్మీకాంతకవి గారు
గుంటూరు జిల్లా బాపట్ల పట్టణ సమీపాన గల ఇటికంపాడు లో నరసింహశాస్త్రి, ఆదిలక్ష్మమ్మ దంపతులకు, 23 డిసెంబరు 1881న జన్మించారు. 30 జూన్ 1953 న చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో స్వర్గస్తులయ్యారు.
గుంటూరు హిందూ కళాశాలలో చదివారు.
లక్ష్మీకాంత కవిగారు స్వాతంత్రసమరయోధులు, నాటక రచయిత,సినీ రచయిత, కవి, అవధాని, నటుడుగా ప్రసిద్ధులు.వీరు1924 లో రాసిన సత్యహరిశ్చంద్ర పౌరాణిక నాటకము ఎంతో ప్రఖ్యాతి గాంచినది. నేటికీ ఈ నాటకము జనాదరణతో సాగుతుంది.
కర్నూలులో మెట్రిక్యులేషన్ దాకా చదివారు.కొన్నాళ్లు సబ్ రిజిస్ట్రారు కార్యాలయంలో గుమాస్తాగా పనిచేశారు. గుంటూరు హిందూ కళాశాలలో ఉపాధ్యాయునిగా పని చేశారు. అవధానాలు చేయటానికి రాష్ట్రంలోని పలువురు జమీందారుల సంస్థానాలను సందర్శించారు. చల్లపల్లి రాజా గారి సహాయంతో గుంటూరులో 1922 సం.లో చంద్రికా ముద్రణాలయాన్ని ప్రారంభించారు. ఉప్పు సత్యాగ్రహంలో చురుకుగా పాల్గొని కారగార వాసం చేశారు. జైలు జీవితం గడుపుతూ సత్యహరిశ్చంద్ర పౌరాణిక నాటకం రచించారు. 1926 లో ఫస్ట్ డ్రామా కంపెనీని 1926 లో ప్రారంభించి సత్యహరిశ్చంద్ర, ఉత్తర రాఘవం చాలా ప్రదర్శనలు ఇచ్చారు. ఈ నాటకాలలో చాలా క్లిష్టమైన పాత్రలను స్వయంగా పోషించారు. ఆయన నటించిన పాత్రల్లో నక్షత్రకుడు ముఖ్యమైనది.
చిత్తజల్లు పుల్లయ్య(సి.పుల్లయ్య)గారి ప్రోత్సాహంతో సినిమారంగంలో ప్రవేశించారు. సినిమాలకు మాటలు, పాటలు రచించారు, కొన్నిటిలో నటించారు. 1939లో వీరు తొలుత నటించినది వరవిక్రయం సినిమా. అందులో లింగరాజు పాత్రను పోషించారు.
సాహిత్యము
1916 లో శివానందలహరి శతకము. శంకరాచార్యుల రచనకు అనువాదం

స్వరాజ్య సమస్య  కావ్యం

బ్రహ్మరథం నవల

మణి మంజూష నవల

బుద్ధిమతీ విలాసము నాటకం

సత్యహరిశ్చంద్ర నాటకము

ఉత్తర రాఘవమ్ భవభూతి రచనకు అనువాదం

చలనచిత్రరంగం

అనసూయ (1936) రచయిత

జరాసంధ (1938)పాటలు

మళ్ళీపెళ్లి 1939.సంభాషణలు, నటన

భూకైలాస్(1940) మాటలు

విశ్వమోహిని (1940) మాటలు

జీవనముక్తి (1942)

బాలనాగమ్మ(1942) రచయిత, నటన

తహసీల్దారు (1944) మాటలు, నటన

బ్రహ్మరథం(1947) రచయిత

రక్షరేఖ (1949) మాటలు, కథ, నటన (సమాచారసౌజన్యం. వికీపీడియా)

## నాటకము

దేవేంద్రుని కొలువులో ఒకనాడు లోకములో సత్యమును మాత్రమే పలుకువారు ఎవ్వరైనా ఉన్నారా? అని చర్చలో వశిష్టుడు భూలోకంలో హరిశ్చంద్రుడు అను రాజు కలడన్నాడు. కాని ఆయన మాటను అంగీకరించని విశ్వామిత్రుడు ఎక్కడా, ఎవరూ కేవలము సత్య సంధులే లేరు అన్నాడు. పట్టుదలలు పందెములకు దారి తీసినవి. విశ్వామిత్రుడు హరిశ్చంద్రునిచే అబద్ధ మాడించెదనని పందెము వేసెను.

రాజు వేటలో ఉండగా విశ్వామిత్రుడు ఇద్దరు కుమార్తెలను సృష్టించి వారిచే నాట్యము చేయించెను. ఆ కుమార్తెలను పెండ్లియాడుమని రాజును కోరెను. రాజు తనకు వివాహం అయినదని, ఒక కుమారుడు కూడా కలిగెనని కావున అంగీకరించ లేనన్నాడు. మహర్షి కోపించగా వివాహము కాక మరియేదైనా అడుగుడు, ఇచ్చెదను అని తన రాజ్య సర్వమును ఇచ్చాడు. ఇంకా ఇవ్వవలసిన బాకీ వసూలు చేయుటకై ముని తన శిష్యుడు నక్షత్రకుని వెంటపంపి రాజును, రాణిని, రాజకుమారుని అడవులకు పంపించాడు.

అలా అడవిలో ప్రయాణము చేసి వారణాసి చేరి, విశ్వేశ్వరుని ఆలయాన్ని చేరారు. అంతవరకు 4 అంకాలు అయాయి. ఇక చూడండి.

## సత్యహరిశ్చంద్రీయము

నాటకము పంచమాంకము

(సతీసుతులతో హరిశ్చంద్రుడు నక్షత్రకుడు ప్రవేశించుచున్నారు)

హరి: దేవీ కష్టము లెట్లున్నను, పుణ్యక్షేత్రమైన వారణాసి దర్శించితిమి. చూడు.

గీ.భక్తయోగ పదన్యాసి వారణాసి
భవదురిత శాత్రవఖరాసి వారణాసి
స్వర్ణదీ తటసంభాసి వారణాసి

పావనక్షేత్రముల వాసి వారణాసి.

నక్షత్రకా! విశ్వేశ్వరుని దర్శించి వత్తము. దేవీ! రమ్ము.

నక్ష: ఇక మాయప్పుమాట నీకుదోచదు. పద. (నడచుచున్నారు)

(యవనిక నెత్తగా దేవాలయము కాన్పించును. అందరు విశ్వేశ్వరునకు నమస్కరింతురు)

హరి: (ప్రాంజలియై)

శ్లో॥ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!
ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః
త్వయైన క్షంతవ్యా శ్శివ మదపరాధాశ్చ సకలాః
ప్రయత్నా త్కర్తవ్యం మదవన మియం బంధుసరణి.

శా. ఆపద్బంధుడ వీవు సామివి గదా! మాలాటి యాపన్నులం
దేపారన్ ప్రముఖుండగా మనకుం దండ్రీ? బాంధవం బింక వే
రే పల్కం బనిలేదుఁ గాననిఁక నీవే సైఁచి నా నేరముల్
కాపాడం దగు నెట్టులైన నిటులే కాయోగ్యబంధుత్వముల్.

నక్ష: హరిశ్చంద్రా! ఇంకనెంతకాల మిట్లు ముక్కు పట్టుకొని కూర్చుండెదవు? రమ్ము.

చ. అలయక గుళ్ళుగోపురము లన్నియు జూచుచు నప్పుమాటయే
తలపవు చేరువయ్యెనుగదా గడువంచు రవంతయేని లో
దలపవు నా ప్రయాసము వృథాయగుచున్నది వెళ్ళబెట్టుమా
పెలుచన మా రుణంబు నెగ వేయదలంచిన నేను బోయెదన్.

హరి: అయ్యా! ఎగవేయవలయునన్న నింత కష్టమున కేల యోర్చితి? తొందర పడకుము.

నక్ష: ఏమీ! సొమ్మీయఁ దలఁచిన వాడవు నీవు తొందర పడకపోగా బుచ్చుకో వలసిన నన్ను గూడ తొందర పడవలదని నీతులు చెప్పుచున్నావుగా? బాగు! అన్నిటికి గాళ్ళు సాచిన నీకేమి తొందర?

ఉ. పుట్టెడు నప్పుతోడ దల మున్గితి వింకొక పుట్టెడైన నీ
పుట్టి మునుంగ దింతయును బ్రొద్దున నీ మొగమింత సూచినన్

బుట్టదు యన్నమున్ మునిగి పోక యిఁకేమిటి? దీపముండగా
నెట్టన జక్కఁ బెట్టుకొన నేరకపోయె గురుండు వెఱ్ఱియై.

హరి: అయ్యా! నిష్ఠురము లాడకుము.

నక్ష: ఏమీ! మాకు రావలసిన సొమ్ము మేమడుగుట నిష్ఠురమాయెనుగా? నీ వడుగుకొన్న నలువది దినంబులు నేఁటితో దీరుచున్నవే. ఇంత దనుక నాకిచ్చిన దొక్కకాసైన లేదే? ఇంక నీ విచ్చెదవని మా కెట్లు నమ్మకముండును? ఇప్పుడు మాత్రము

శా. ఏలీలన్ సవరింతు మా రుణము కొంపే గోడియే నింత కూ
డే లేదేమిటి కింక జంపెదవు పొమ్మీ మీకు నేనాటి బా
కీ లన్న నిన్ను గొట్టువాడెవడు? చిక్కెన్నీకు మాజుట్టు ప
త్రాలా? సాక్ష్యములా? నినున్ బలిమి మీదన్ రచ్చకీడ్పింపగన్.

హరి: నక్షత్రకా! పత్రములు సాక్షములు నేల కావలయును? నిత్యస్థిరంబయిన నా వాక్కున కన్యథాత్వ మెప్పటికైన సంభవింపదు గదా!

నక్ష: సంభవింపక యిప్పటికి జేసిన దేమున్నది?

హరి: అయ్యా! నా దీనదశ యించుక యోచించుము.

నక్ష: అలాగయిన నేను యోచించి చెప్పునది గట్టిగా వినుము.

శా.నీ కాతం డది యప్పు వెట్టినది కానే కాద యామౌని ని
న్నే కైసాచి మదర్థ మిమ్మనిన సొమ్మేకాని, యద్దానికై
నీ కన్నుంగవ దుమ్ము సల్లి యిట మున్నే రాజ్య సర్వస్వముం
జేకొన్నాడిక నేటి యప్పు నిజముం జింతింప నింతే కదా?

హరి: ఇంతియె కాని నెలదినములలో నిచ్చెద నని యమ్మునితో నొప్పుకొంటిని గదా!

నక్ష: లేదనిన నా మాటలన్నియు సున్న యగుం గాదే!

హరి: అయ్యా! సత్యేతరంబునకు నా మానసం బొప్పదయ్యా!

నక్ష: అయ్యో! అమాయకుడా! ఇంతలోఁ జెడ్డప్పుడు గూడ సత్యము సత్యమని యూగులాడు చున్నావే హరిశ్చంద్రా! నీ వేమనుకొన్నను

మ.జటినై నేననరాదు కాని విను నీ సత్యంబే నీ కొంప కిం
తటి చేటొౌటకు మూల మిప్పటికినైనన్ మించిపోలేదు తీ
ర్చుట కేనాటి రుణంబు మీకనిన దీరున్నీకు మా బాధ! యం
తట నూరేగుము సత్తుచిత్త నుచు జింతన్ బాసి బైరాగివై.

అట్లుకానిచో నింత ధనము నీ విప్పట్టున నెట్లార్జించెదవు? చెప్పుము.

సీ. వైదిక వృత్తి సంపాదింతు నంటివా
యుడుగవు రాచపోకడలు నీకు
రాచరికంబు శౌర్యమున దెత్తు వటన్న
దెసమాలి యేవంక దిక్కులేదు
వణిజువర్తనముచే గణియింతు నంటివా
యరచేత గుడ్డిగవ్వైన లేదు
వ్యవసాయవృత్తిచే సవరింతు నంటివా
లేదు భూవసతి గోష్పాదమంత
గీ.ఇందు నేదేని వ్యాపార మందదగిన
యంత పున్నెంబు పుట్టిన నింత ధనము
గంటుకట్టునె యీ స్వల్ప కాలమునను
గడచు నీ నాటితోడ మా గడువుదినము.

ఇవియేమియుగాక బానిసవృత్తికి బాల్పడినను నిన్నెవరు కొనువారు లేరు. కావున నా యుపదేశవాక్యముల ననుసరించి నీవీ రుణబాధ తప్పించికొనుము. మా గురువు గారితో నీ దురవస్థ యంతయు జెప్పి యీ సొమ్ము వదిలివేయు తెఱంగొనరించెద. చెప్పుము ఏల నీకీ బాధ?

హరి: నక్షత్రకా! నా కంఠము గత్తిరించు చున్నను నసత్యమాడుటకు నా మనంబొప్పదు.

నక్ష: హరిశ్చంద్రా! నీ మేలు గోరి నేనింత వచించెద వినుము.

ఉ.పుట్టిననాఁట నుండియును బొంకి యెఱుంగవు యే నెఱుంగు ది
 ప్పట్టుని గూడులేని దురవస్థల నుంటివి గాన నీ మనం
 బెట్టిదొ తెంపుచేసికొని యీ యుపదేశము నాలకింపు మే
 నొట్టిడి కొం దసత్యమున కొప్పితివంచు వచింప నేరికిన్.

చంద్ర: నక్షత్రేశ్వరా! నీ వంటి మునికుమారుడు చెప్పవలసిన నీతులా యివి?

నక్ష:

చంద్రమతీ! నీవును నీ పెన్మిటికిం దగినట్టు దొరికినావు పో,

శా. మీనిప్పచ్చరముం దలంచి కరుణన్ మీ బాగుకై యింతగా
 నేనేమో హితమున్ వచించితిని, మీ కే లేని యీ బాధ నా
 కా? నీ పెన్మిటి నీ వెటైన విను నా కౌనేమీ! పోనేమి నా
 స్నానంబో జపమో తపంబో సదను ష్ఠానంబొ యోజింపుమా.

చంద్రమతీ! నా నీతులు మీరు విననక్కర లేదు. ఊరక యద్దుపుల్లలు వేసినట్లు కాదు. మాకు రావలసిన సొమ్ము గవ్వలతో గూడ లెక్కపెట్టి మా కిప్పింపుము. నేనింక క్షణమాగను, మీమీది మోమాటముచే నేనింకను నాలస్యముచేసినచో సహజముగా ముక్కోపియైన మా గురువుగారు నాగొంతు గొరుకక మానరు. హరిశ్చంద్రా! నీ పెద్దరికం బాలోచింపను. మా సొమ్ము గుమ్మరించి మరి నడువుము.

(చేయి పట్టుకొని నిలవేయుచున్నాడు)

హరి:

(నిట్టూర్పు విడిచి) దేవీ! ఈ రుణబాధ కడుంగడు దుర్భరము గద! చూడు.

మ. సరివారి న్నగుబాటు పిమ్మట మనశ్చాంచల్య రోగం, బనం
 తర మాహారమునం దనిష్ట, మటుమీదన్ దేహజాడ్యం, బటన్
 మరణంబే శరణంబు, పెక్కు దినము ల్మంచాన జీర్ణించి ఇం
 తిరొ! యీ ప్రాణులకున్ రుణవ్యథలకంటెన్ దుస్సహం బేరికిన్.

దేవీ! మందభాగ్యుండనైన నే నిప్పుడేమి చేయుదును? నిరవశేషముగా రుణము దీర్చివేసికొని సంతోషించు భాగ్యము నాకు లేకపోయెనే?
చంద్ర: నాథా! మీరిప్పట్టున ధైర్యము వహించి నా మనవి నాలింపుడు.

గీ.కాలగతి సర్వసంపద గోలుపోవ
మిగులు సిరి నాకు మీరును మీకు నేనె
బానిసగ నన్ను నే కలవానికేని
నమ్ముకొనుఁ డింక మౌని రుణమ్ము దీరు.
హరి: హా! విధీ! ఈ హరిశ్చంద్రునకు నెంతటి యవస్థ దెచ్చితివి?
ఉ. అంతటి రాజచంద్రునకు నాత్మజవై కకుబంతకాంత వి
శ్రాంతయశోవిశాలుని త్రిశంకు నృపాలుని యిల్లు సొచ్చి భా
స్వంతకుల ప్రసిద్ధికొక వన్నె ఘటించిన గేస్తురాంద్ర మే
ల్బంతిని నిన్ను నొక్కనికి బానిసగా దెగ నమ్ముకొందునే?
చంద్ర: ప్రాణేశా! నీచంబని సంకోచించవలదు. సత్యప్రతిష్ఠకై యొనర్చిన నీచ కార్యంబులును సగౌరవంబులేయగు.
హరి: హా! జీవితేశ్వరీ! హా! సుగుణసుమవల్లీ! కఠినకర్ముండ నగు నేనెంతకు జాలను? హృదయమా! నేటితో నభిమానము వదలివేయుము. దేవీ! చంద్రమతీ!
గీ.హృదయమున నెగ్గు సిగ్గులు వదలివేసి
దాసిగా నిన్ను నమ్ముకో దలచినాడ
వాడవాడల నిన్ గొనువారి నూర
వెదకికొన బోవుదుము జనవే లతాంగి!
చంద్ర: (నడచుచు) ఓ దేవా! కాశీవిశ్వనాథా! నన్ను గొనువారి ద్వరలో గను పరచి మమ్ము విశ్వామిత్ర రుణబాధా విముక్తులను జేయుము, తండ్రీ!
నక్ష: హరిశ్చంద్రా! ఇదియే అంగడి వీథి. ఇక్కడ ఒక్క కేక వేయుము.

హరి: దేవీ! నేనిప్పుడేమి ఘోషించవలయును.

చంద్ర: క్రయ ధనమ్ము నమ్ము కొనువారెట్లో యట్లే.

హరి: ఓహో! పౌరులారా! (కొంచెమూరకుండి) అయ్యో! యెంత నైచ్యమునకు బాల్పడుచుంటిని?

నక్ష: హరిశ్చంద్రా! ధనమిచ్చి కొనదగిన వారంద రిక్కడనే యున్నారు? ఇంక నీ యాగడములు చాలించి యందరు వినున ట్లెలుంగెత్తి కేక వేయుము.

హరి: అయ్యా! నేనన్నిటికి దెగించియే యున్నాను.

(ద్విపద - రాగము కీరవాణి - తాళము ఆది)

అవధారుడయ్య యో యగ్రజులార!
సవనదీక్షితులార! క్షత్రియులార!
ప్రవిమల గుణగణ్య పాదజులార
కడలాక్రమించి యొక్కట భూమి నేలి
సడినున్న యీ హరిశ్చంద్రుడ నగుట
ప్రణుత కౌశిక రుణగ్రస్తుండ నగుట
గుణములదొంతి పల్కులమేలుబంతి
పున్నె పింతుల యీలు పున కోజబంతి
యన్నుల తలకట్టు లందు సేమంతి
యగు నాదు నిల్లాలి హా! దయమాలి
తెగ నమ్ముకొందు వీధిని దాసిగాను
చేరి రొక్కంబిచ్చి చెల్వను గొనుడి
వారణాసీ పౌర వరులార! మీరు
మరియు నో సౌభాగ్యమహితాత్ములార!

సీ.జవదాటి యెరుగ దీ యువతీలలామంబు

పతిమాట రతనాల పైడిమూట
అడుగుదప్పి యెఱుంగ దత్తమామల
యాజ్ఞ కసమానభక్తి దివ్యానురక్తి
అణుమాత్రమైన బొంకనుమాట యెరుగ
దీ కలుష విహీన నవ్వులకు నైన
కోపం బెఱుంగ దీ గుణవితాన నితాంత
యొరులెంత తన్ను దూరుచున్న సుంత
గీ.ఈ లతాంగి సమస్త భూపాలమకుట
భవ్యమణికాంతి శబలిత పాదుడైన
సార్వభౌముని శ్రీహరిశ్చంద్రు భార్య
దాసిగా నీపెఁ గొనరయ్య ధన్యులార!

(పిమ్మట కేశవునితో గాల కౌశికుడు ప్రవేశించుచున్నాడు)

కాల: ఓరీ! శిష్యా! ఎక్కడరా బానిసల విక్రయించునది?

హరి: బ్రాహ్మణోత్తమా! ఇక్కడనే. మందభాగ్యుడనైన నేనే బానిసల విక్రయించు చున్నాడ.

కాల: అట్లయిన నీవెవ్వడవు? ముందు చెప్పుము.

హరి: నే నెవ్వండనైన మీకేమి?

కాల: ఏమోయీ. పేరు చెప్పుటకే సందేహించుచున్నావు. ఈ కాంతను నీ వెక్కడనో యెత్తుకొని వచ్చినట్లున్నావే! ఆఁ! నీవే దొంగతనము చేసినను సాగివచ్చుటకు నీ కాశికా పురమంత యరాజకముగ యున్నదనుకొంటివేమి? బోయవానికి రామచిలుక లాగున నీకీకాంత యెక్కడ చిక్కినది? ఫాలాక్షునంత వాడనైన నాకంటంబడి తప్పించుకొని బోవుట కల్ల. (శిష్యునితో) ఓరీ! కేశవా! నీవు పోయి మనయూరి తలారి పెద్ద యగు రామసింగును బిలుచుకొని రమ్ము. ఈ ముచ్చును పట్టి యొప్పగింతము.

హరి: అయ్యా! విప్రోత్తమా!

గీ. ధరణిలో దొంగతనములో దొరతనములో

భాగ్యవంతునకేదైన బాధలేదు
పెన్నిధి యదృష్టమున నిరు పేదవాని
కబ్బినను దొంగసొమ్మంట కబ్బురంబె?

కాల: ఏమీ! నీ యదృష్టమునకు దోడు నీకీ కాంత యెక్కడో లభించినదా?

హరి: అదృష్టమున లభించినది. నేను హరిశ్చంద్రుడను. ఈమె నాభార్య చంద్రమతి.

కాల: ఏలాగూ! విశ్వామిత్రున కప్పుపడితినని యరచినది నీవేనా? ఆలాగైన తపోధనుడైన యమ్మౌని కీవెట్లు రుణపడితివి?

హరి: నారాజ్యసర్వస్వ మాతనికి ధారవోయునప్పుడు మున్నాతనికి యజ్ఞార్థమై ఇచ్చెదనన్న ధనము ముందు నిరూపింపకపోవుట వలన.

కాల: పత్రము వ్రాసి పుచ్చుకొనినగాని యప్పుకాదు గదా! సాక్షులెవరైన నున్నారా?

హరి: సత్యశీలమే పత్రము. మా యుభయుల చిత్తములే సాక్ష్యములు.

కాల: ఓయీ యమాయకుడా! ప్రాణము లేని యీ పత్రమునకును సాక్ష్యములకును భయపడి
నిక్షేపము వంటి యిల్లాలి నమ్ముకొను చున్నావా? (ఆలోచించి) ఉండుండుము. నాకిప్పుడు
మంచి యుపాయము తోచినది. నన్నా విశ్వామిత్రునొద్దకు దీసికొనిపోయి యీ ధనము నీకీయవలసినది కాదని పోరాడుము. నీ పక్షమున నేను న్యాయవాదిత్వము గైకొని రాయి గ్రుద్దుచు వాదింపగలను. ఓహో! ఒకరికిం బదుగురు సాక్షులుంచిన పత్రముల నెగవేయుట లోను ద్రోవబ్రోవు వారిపై లేని యప్పులగట్టి ధనము గణించుటలోను నన్ను మించిన వాడు మరొక్కండు నీకు దొరకడు. పద, నేను నీకు సహాయుడనై యుండ విశ్వామిత్రుడును గిశ్వామిత్రుడును నిన్నేమి చేయగలడో చూతము.

నక్ష: హరిశ్చంద్రా! నీ కిప్పుడు సహాయ సంపత్తి కూడ లభించినది! ఇంక రమ్ము.

హరి: అయ్యలారా! మీ రిరువురును మహాబ్రాహ్మణులు కాని యూరకుండుడు. నా కెవ్వరి సహాయమక్కరలేదు. నా సత్యమే నన్ను రక్షింపవలయును గాని,

మ.ఇటులెంతైన ధనంబు వచ్చినను రానీ గాధిరాట్పూతి నా
కెటు కష్టంబుల దెచ్చెనేనియును దేనీ దివ్యభోగంబు లె
న్నిటి నాకాజడదారి యిచ్చినను నీనీ, సత్యముం దప్ప నే
నిటు సూర్యుండటుతోచెనేని వినుడోయీ మీరు ముమ్మాటికిన్.

కాల: ఓహో! నీ వెంత సత్యవంతుడవైనను ధనము పట్ల గొంచెము సడలు విడవ వచ్చును. అందుకే "సర్వేజనాః కాంచన మాశ్రయంతి" యని పెద్దలు చెప్పుచున్నారు. నా యీ శాస్త్రప్రమాణ మంగీకరించి కౌశికునొద్దకు నడువుడు. చూడుము.

క.ఆలాగున గౌశికుడే
పాలయ్యె, ధనాశకింక వల దుడుగుము నీ
కేలా! యీ వేదాంతము?
పా లొల్లని పిల్లి గలదె పరికింపంగన్?

హరి: అయ్యా! ఏల మీకిన్ని మాటలు?

కాల: సరి, నీకి బాగుపడు యోగము లేదు. తియ్యని చెరకుపానకము నోట బోయుచుండ విషమని గ్రక్కువాని కెవ్వరేమి చెప్పగలరు. నీ యిష్టము. నీ భార్యనెంతకమ్మెదవు?

హరి: నక్షత్రకా! చెప్పుము.

నక్ష: ఓ కాలకౌశికుడా! వినుము.

క. దంతావళంబు పయి బల
వంతు డొక్కండు నిలిచి పైకిన్ రతనం
బెంతటి దవ్వుగ రువ్వునో
యంతటి యర్థంబు నిచ్చి యతివం గొనుమీ!

కాల: ఓహో! కేశవుడా! ఇదేమి చవుకబేరము గాదురా!

నక్ష: మరి పంచాంగము కట్టకే వచ్చునేమి?

కాల: ఏమిరా చెడుగా, మాయాయవారపు జోలె చూచి నన్ను ధనహీనునిగా గణించుచున్నావు కాని, దీనిని మా యింటికి బంపి వేయుము. ధనమిచ్చి వేయుదను. హరిశ్చంద్రా! సరియేగదా!

హరి: అయ్యా! అట్లే.

కాల: దాసీ! ఇక బద. కుర్రా! నడువుము. (బెత్తమున నదలించుచు)

చంద్ర: అయ్యా! వచ్చుచున్నాను. (పతి పాదములపై బడును)

కేశ: దాసీ! నడువమేమి?

చంద్ర: హా! మందభాగ్యనైన నేను నేటితో మీ దృష్టినుండి సయితము దొలగింపబడి పరాధీననై పోయితినే! ప్రాణపతీ! హరిశ్చంద్రా! నాకింక దిక్కెవరు?

ච.పదపద యంచు బెత్తమున బ్రాహ్మణుఁ డిట్లదలించు చుండినన్
బదమటు సాగకున్నది భవత్పద సారసభక్తి యందు నె
మ్మది వశమౌట, చంద్రకర మర్దన మందుచునుండినన్ బదిం
బదిగ మరందలోలయయి పద్మము బాయని భృంగికైవడిన్.

అకటకటా! మిమ్ముఁ జూచు నవకాశము నాకు లేదు. నా యజమానుఁడింకను దొందరపడుచున్నాడు. ఈ స్వల్పకాలములోనే శుభదాయకం బగు మీమూర్తి గనులారఁ గాంచి పోయెదను. ప్రాణపతీ!

సీ.కదలవే యని విప్రుఁడదలించుటకు మున్ను
గనులార మీ మోము గాననిండు
పదవేమి యని వటుండదలించుటకు మున్నె
మీ నోటి నుడి తేనెలాననిండు
నడువవేమని విప్రుఁడదలు వెట్టకమున్నె
పొడము మీ కన్నీరు దుడువనిండు
సాగవేమని వటుల్లాగవచ్చుటకు ము
న్నింపుగా మిము గౌఁగిలింపనిండు

గీ.పరమ కరుణాసనాథ మత్ప్రాణనాథ!

కాలగతి మీకు దూరస్థురాల నగుచు

వెడలు కన్నీట బాదము ల్గడిగి మీకు

బ్రణుతులిడుచున్న దాన సద్గుణ నిధాన!

హరి:

(నిర్వేదముతో) ఛీ! ఛీ! హరిశ్చంద్రా! నీవు నిక్కముగా గిరాతునకు జన్మింప వలసిన వాడవుగదా?

గీ.గళమునం దాల్పవలసిన యలరుదండ

పాదమర్దన కొప్పించు భంగిగాగ

నఖిల సామ్రాజ్యభోగంబు లందఁదగిన

పట్టపుఁ దేవి నమ్మితే బానిసగను.

చంద్ర: హృదయేశ్వరా! నాకై మీరింతగా దుఃఖింపవలదు. విధి విధాన మెవ్వరు తప్పింతురు? దుఃఖ మడంచుకొని యా కాలకౌశికుని సేవావృత్తికి నన్నిఁక సమ్మతించి పంపివేయుడు.

హరి:

దేవీ! ఇప్పుడనుమతించుటేమి? ఆగర్భశ్రీమంతురాలవైన నిన్ను బరున కెప్పుడు విక్రయించితినో యప్పుడే నా యనుమతులన్నియు దీరినవి. కాని,

మ.కనుసన్నన్ బనికత్తెలెల్ల నిరువంక \న్ గొల్వ రాణించు జీ

వనమే కాని యెఱుంగ వెప్డుఁ బర సేవాకృత్య మా జన్మమున్

వనితా నేటికి నీకు నా వలన బ్రాప్తంబయ్యె నెట్లోపెదో?

ఘనదుర్దాంత దురంతదుస్సహమహోగ్ర క్రూర దాస్యంబునన్.

మానవతీ! రాణివాసంబు భోగభాగ్యంబులకు జెడి నూతనముగా దాసికావృత్తి నవ లంబింప బోవుచున్న నీకు గొంతచెప్పుచున్నాను. సావధానముగా నాకర్ణింపుము.

మ.తల్లి దండ్రుల్ మరి వేర లే రిక సతీ! తద్దంపతుల్గాక నీ
కిల, వేమరపాటు సెందకుసుమీ యీ విప్ర సేవాకృతిన్
దొలి నీ వొందిన భోగభాగ్యముల యందున్ జిత్తమున్ నిల్పకే
తలలో నాలుకగా మెలంగుము నెలంతీ! పిన్నలన్ బెద్దలన్.

మరియు నో సాధ్వీమణి! నీ స్వామి కడనె బానిసీఁడుగ నుండవలసినవాడు గాన గుర్రవాని లోహితాస్యునెట్లు కాపాడుకొందువో? మనకు నేటితో దురంతమైన వియోగంబు సంభవించినది కదా! (లోహితాస్యునితో) నాయనా! లోహితాస్యా! నీవు కూడా నీ తల్లి ననుసరించి యుండవలసినవాడవే కాన నావెంట రాకుము.

లోహి: నాన్నగారూ! మీ రెందుల కేడ్చుచున్నారు? మీ రిప్పుడెక్కడకు బోయెదరు?

హరి: నాయనా! నే నెక్కడ బానిసీఁడుగా నుండవలెనో యక్కడికే.

(దీనవృత్తము - హిందూస్థానీ భైరవి -ఆది తాళము)

లోహి: జనకా! యిపుడెచ్చటి కేగకుమా
నను నీ వెనువెంటను గొనిపొమ్మా
జననిన్ నను నిచ్చట బ్రాహ్మణుఁడే
కొనిపోయిన మాకు సుఖంబగునే?

హరి: తండ్రీ! (యెత్తుకొని) నీకు రావలసిన కష్టములా ఇవి?

మ.కొడుకా! కష్టము లెన్ని వచ్చినను నీకున్నాకు నాకీడులం
దెడబాటు ల్ఘటింయింపకుండు టొక మేలే యంచు నే సంతసం
బడితింగాని యెఱుంగనిన్నుఁ దెగనమ్మంజూపి హా లోహితా!
కడ కీనాటికి గాలసర్పమునకుం గైకోలుఁ గావించుటన్.

హా! తండ్రీ! నీ కమంగళము ప్రతిహత మగుగాక!

(మరల)

కడ కీనాటికి గాలకౌశికునకుం గైకోలుఁ గావించుటన్.

దేవి నేనెంత దారుణమైన వాక్యము బల్కితిని.

చంద్ర: నాథా! మనకు దుఃఖము శాంతించుగాక!

గీ.కాలవశమున గల్గిన కష్టచయము
లెల్ల వెంటనే నిలుచునే యేక రీతి
మిహిర మండలమును గప్పు మేఘరీతి
తూలిపోకుండునే యెల్ల కాలమటుల?

అట్లే యచిరకాలమునకు మరల శుభములు వచ్చి పునస్సమాగమ సౌఖ్యము లభించకపోదు.

హరి: దేవీ! భవితవ్యమును నెవ్వ రెఱుంగుదురు? చూడు.

మ.కలికీ! ఱెక్కలురాని పిల్లలను సాకన్ గూటిలో నుండి మే
తలకై పోతొక చెంత బెంటియొక చెంతన్ బార నీలోన బి
ల్లలఁ బామే గ్రసియించునో వలల పాలన్ జిక్కునో పున్గలీ
యిలపైఁ బ్రాణులకున్ వియోగమగుచో నెవ్వారి కెవ్వారలో?

కేశ: ఏమయ్యా! శుభమస్తు అని మాగురువుగారు దాసిని గొనుటేమి? మీరిట్లశుభముగా నేడ్చుటేమి? పద పద (అదలించును)

లోహి: (కోపముతోఁ గేశవునిఁ జూచి) (స్రగ్విణీవృతము: బేహాగ్ - ఆది తాళము)

ఏర! మాయమ్మని ట్లీడ్వ నీకేమిరా
క్రూర! నిన్నిప్పుడే గ్రుద్దెదన్ జూడరా!
దూరమందుండి మా తోడ మాట్లాడరా!
శూరునిన్ లోహితున్ జూచి నోర్మూయరా!

కేశ: ఓరీ! చెడుగా, దాసిపుత్రా! కూటికి లేకపోయినను నీకెంత రాజసమున్నదిరా? (పడద్రోయును)

లోహి: (కన్నీరు కార్చుచు దండ్రివంక జూచును)

హరి: (దుఃఖముతోఁ గుమారు నెత్తుకొని) తండ్రీ! నీకెంత దురవస్థ వచ్చెనురా!

మ: కనుదోయిన్ జడబాష్పము ల్దొరఁగ నాకై యేల వీక్షించెదో
తనయా! నేను మహాకిరాతుఁడ సమస్తద్వీప భూమండలీ
జననాథాళికి సార్వభౌముడవుగా జాల్నిన్ను నీ దాస్యపుం
బనికై యమ్మిన నాకు నెచ్చటిదయా ప్రారంభవిస్రంభముల్.

కాల: ఓహో! యేమోయీ! నీకొడుకిట్లను చున్నాడే? ఇక మా ఇల్లల్లకల్లోలము చేయునా ఏమి?

హరి: అయ్యా! ఇది కేవల బాల్య చాపల్యము. కాని నామనవి యొక్క టాలింపవలయు.

కాల: అది యేమి?

హరి:

గీ.మీరు బిడ్డల గని పెంచువారె యైన
గడుపు కక్కురితిని నింతగా వచింతుఁ
బ్రేమ నీ బిడ్డలందొక బిడ్డగాగ
నరసి కొనుమయ్య వీనిఁ గృపాంబురాశి!

(లోహితు నొప్పగించును)

కాల: సరి, నీ యొప్పగింతలన్నియు నైనవా? ఇంక మా దాసినిఁ బంపివేయుము. మాకు జాగగుచున్నది.

చంద్ర: (దుఃఖముతో) (సరసాంక వృత్తములు - ఫీలు రాగము)
సెలవిచ్చి నన్పంపుడీ క్షితిపాలచంద్రా!
నలవంత జెందకిక పావన సత్యసాంద్రా!
హరి: కలకాల మీ గతిని దుఃఖముతో సుశీలా!
తలపెట్టు టూరడిలు నింతట ముద్దరాలా!
చంద్ర: ఇక జాగుచేయదగదో నృపసార్వభౌమా!

సకలం బెఱింగి యిటు లెస్సయ పుణ్యధామా!

హరి: అకలంకశీల! నిను నిట్లలయించినాఁడన్

మొగమెత్తి యెట్లు గననోపుదు సిగ్గు తోడన్.

కాల: ఓహో! మీ ఏడ్పుతో మా పనులన్నియు జెడుచున్నవి. దాసీ కదలవేమి? మూటలెత్తుకొని రమ్ము.

చంద్ర: (లోహితాస్యునితోఁ దిరిగి తిరిగి పతిం జూచుచుఁ బోవుచున్నది)

హరి: హా! హా! నా పుణ్యలక్ష్మి దాఁటి పోయినది.

నక్ష: హరిశ్చంద్రా! నీవు విశ్వేశ్వరదేవాలయము నొద్ద నుండుము. నేను ధన మందికొని వత్తును.

(కాలకౌశికునితో నిష్క్రమించును. తెర వ్రాలును.)

(పిమ్మట యవనిక నెత్తగా గాలకంటకి గృహద్వారముకడ బ్రవేశించును)

కాలకం: ఓరీ, యెవడురా? కేశవా! జనార్దనా! అంగడికి బోయిన మా యాయన యింకను రాలేదుగా? కానీ

(కాలకౌశికుడు, కేశవుడు, చంద్రమతి, లోహితాస్యుడును ప్రవేశించుచున్నారు)

కాలకౌ: ఓరీ, కేశవా! అదిగో అరచుచున్నదిరో.

కేశ: ఈనాడు మీ గ్రహచార మంతగా బాగున్నట్లు తోచదు.

కాలకౌ: ఏమోరా నాయనా! నీవు మాత్రము మాముండతో నామీద గొండెములు చెప్పకేమి.

(ఇల్లు చేరుదురు)

కాలకం: వచ్చుచున్నావూ? రా, రా. (సమీపించును)

చంద్ర: (స్వగతము) అకటకటా! ఏమీ ధూర్తయైన యీ విప్రాంగన వర్తనము! ఈవిడయే నా యజమానురాలు గాబోలు.

కాలకం: దుర్మార్గుడా! నీ విల్లు వదలి యెంతసేపయినది? నీ కొరకై పొయ్యార్పుకొని నేను గనిపెట్టుకొని యుండవలసినదా? ఈమధ్య నీకు బొత్తిగా బ్రాయశ్చిత్త కర్మములు లేకుండ నున్నవి. నేడు నీకు మూడినది గానీ చెప్పు.

(కీర్తన: ఫరజు - త్రిశ్రగతి)

ఇంత పొద్దెక్కినదాక నీ వెక్కడ నుంటివి ఇంటికి రాక ॥ఇం॥

కాలకౌ: యాయవార మెత్తినాఁడ సంతపోయి శవాలను మోసికొచ్చినాఁడ ॥యా॥

కలకం: తెచ్చిన డబ్బేదో తెమ్ము నీ ముచ్చుపోకిళ్ళను మెచ్చ రారమ్ము

కాలకౌ: మూడెమాడలం దెచ్చి నాడ నీతోడు నాకింకను దొరకలేదేవాడ

కాలకం: అట్లైన నే నూరుకోను నీపొట్ట బద్దలుచేసి నెట్టివేయకపోను (కొట్టుచున్నది)

కాలకౌ: అబ్బబ్బ నే నోర్వలేను యీ డబ్బునకు రేప యిబ్బడి ఈడ్చెదనే

కాలకం: నీ వింక జాగరూకతతో మెలంగకున్న నీగతి యింతియే.

కేశ: అమ్మా! కాలకంటకి నే డప్పుడే వదలి పెట్టినావే? ఇక్కడ చూడు.

(చంద్రమతిని, లోహితాస్యుని చూపించును)

కాలకౌ: ఓరీ, కేశవా! నీ పుణ్యము, నీ వూరుకోరా! (గడ్డము బట్టి బ్రతిమాలును)

కాలకం: ఇక నేనూరుకోను. ఈ నిర్భాగ్యురాలెవరు? చెప్పు. (కొట్టును)

కాలకౌ: (గట్టిఁగా జేతులు పట్టుకొనుచు) నీకడుపుకడ, ఇంక చంపకే!

కాలకం: ఓరీ నీ చేతులు కాలిపోను! నీశక్తి మండిపోను! ముసలితనము వచ్చినను నీ కెంత మదమున్నదిరా! ఓ యెవరయ్య! నన్ను నామగడు చంపుచున్నాడు. రండయ్యా!

(కేకలు వేయుచున్నది)

కాలకౌ: (నోరుమూయుచు) ఓసీ, నీపుణ్యము. అరవకే. సుకుమారివి, నీ వింటిలో బనిచేసుకోలేవని దాసిని దెచ్చినాడను.

కాలకం: ఆ మాట మొదటనే యేడువరాదా?

చంద్ర: అమ్మా! కాలకంటకీ! ఇదియేమి న్యాయమమ్మా!

క.పతిఁ గడవ సతికి, లేదొక

గతి యాతండెంత మనకు గైవసమైనన్
మితి గలదు చనువునకు నీ
గతిఁ బ్రతికూలతకు బాలు కావలదమ్మా.
శా.ప్రత్యూషంబున లేచి నాథుని పదాబ్జాతంబుల్ వ్రాలుటో
పత్యుద్దేశ మెఱింగి బోనముల సంబాళించుటో రాకకున్
బ్రత్యుత్థాన మొనర్చి మెచ్చఁ దగు సేవల్ సేయుటో కాకిటుల్
ప్రత్యాఖ్యాన మొనర్తురమ్మ సతమున్ బత్యాజ్ఞకున్ గేహినుల్?

మరియు,

మ.పడతీ! నేనొక పాటిగాను వచియింపన్ నీవిభుండెంత నీ
యడుగు దాటడ యేని బత్తి మిగులన్ హత్తించి బంగారమే
యొడలెల్లన్ దిగువేయునట్లుగను నీ వోరంక ప్రొద్దెల్ల మే
లడ పాలూనుము, కాళులొత్తు మటుగా దాసీవరుల్ వీచుమా.

కాలకం: ఓహో! నీ వెవ్వతివే? నాకు జక్కట్లు దిద్దుటకేనా నా మగండు నిన్ను దీసికొనివచ్చినది? ఓహో! నాకు దాసివై వచ్చి దొరసాని వైతివే నీకు దెలిసిన మగనాలి వర్తనాలు మాకు దెలియవేమి? గూటికి వచ్చిన దానవు చచ్చినట్లు పడియుండక శ్రీరంగనీతులు చెప్పుచు నా మాటలో బడియున్న నా మగనిబుద్ధి చెడ గొట్టుచున్నావుగా.

కాలకౌ: చంద్రమతీ! నీ వెప్పుడు మాయావిదతో నిట్లు మాట్లాడరాదు.

(రహస్యముగా) దీని నోటికి నూరి కరణాలు, కాపులు గూడ వెరచుచుందురు.

చంద్ర: అయ్యా! నే నూరకున్నాను.

కాలకౌ: ఓసీ, యింటిదానా! నీకు నింత నిర్భయముగా మాట్లాడిన యీ దాసికి దగిన పనులు నియమించి నీ కసి దీర్చుకొమ్ము.

కాలకం: అట్లయిన పద, నీ పనిన్ చెప్పెద.

(అందరు నిష్క్రమింతురు)

(పిమ్మట నక్షత్రక ద్వితీయుండై హరిశ్చంద్రుడు ప్రవేశించుచున్నాడు)

హరి: నక్షత్రేశ్వరా! నన్నింత యన్యాయము చేసెదవా?

నక్ష: అడవులలో నన్నిన్నాళ్ళన్నమునకు నీళ్ళకును మొగము వాచునట్లు చేయుట నీది యన్యాయము కాదు గాని న్యాయముగా నాకు రావలసిన బత్తెము నేను తీసికొనుట యన్యాయ మయ్యెనేమి? యెట్లు?

ఉ.బత్తెము లేక త్రోవల విపత్తుల కోర్చుచు దిండి కేనియున్
బొత్తుగా వాచిపోయి గృహమున్ విడి నీ వెనువెంట రాగ నీ
తొత్తునె యింతకంటెను గతుల్మరి మాకిక లెవె యేరికిన్
మెత్తనివాని జూచు నెడ మిక్కిలి మొత్తగ జిత్తమౌ గదా!

హరి: నక్షత్రకా! మీ గురువుగారి పనిమీద నీవు నా వెంట వచ్చితివి కాని, నా కొరకై వచ్చితివా? నా వలన బత్తెమే నీవు తీసికొనిన నీవు నీ గురువునకు జేసిన యుపకారమేమున్నది?

నక్ష: ఓయి దుర్మార్గుడా! ఏమన్నావు? నేను నా గురువునకు జేసిన యుపకారమేమనియా?

ఉ.ఆస దొరంగి ప్రాణముల కైన దెగించుచు నిట్టి బత్తెపుం
గాసుల నాసచే దరువు కానిగ నీ పయి ఘోరకాననా
వాస మొనర్చ నొప్పుకొని వచ్చుటె నాయుపకార మాతపో
భ్యాసికి నా వలెన్ వటుఁడెవం డిటు నెత్తురుకూటికొప్పెడిన్

ఇప్పుడు నా గురుభక్తిని గూడ నధిక్షేపించుచున్నావుగా? నీ వేమైన నను ము. నీ భార్య నమ్మగా వచ్చిన ధనము బత్తెము క్రింద జెల్లవలసినదే. కాన నిక మా గురువుగారి ఋణమిప్పుడే యిచ్చివేయుము.

హరి: వటూత్తమా! నేనిప్పుడింత ధనమెక్కడినుండి తెత్తునయ్యా?

గీ.విమలశీలను నిల్లాలి విక్రయించి
చేర్చిన ధనంబు నీ చేత జిక్కెను గద
అవని స్వశరీరమాత్ర వైభవుఁడ నగుచు

బ్రతుకు చున్నట్టి నేనెట్లు బత్తెమిత్తు?

నక్ష: నీ విట్టి నిర్భాగ్యుడ వనియే నేను దీపముండగనే చక్కబెట్టుకొన్నాడ. ఓ హరిశ్చంద్రా! ఇటు వినుము.

గీ.నీకు రానున్న బత్తెంపు రూకలెటులో
స్వీకరించితి నే నిల్లు సేరవచ్చు
ముని రుణమునకు మీరు మీరును బెనంగి
తుదకు నే గంగలోనైన దుముక బొందు

(పోవుచున్నాడు)

హరి: (చేయి పట్టుకొని) నక్షత్రకా! నీకిది బొత్తుగా దగనిపని.

నక్ష: ఏమోయి చేయి పట్టుకొనుచున్నావు? నన్ను గొట్టుదువా యేమి?

హరి: అయ్యా! నేనంత సాహసిని గాను.

నక్ష: కాకున్న నా చేయి విడువుము.

హరి: విడిచితిని. ఇంక నా సొమ్ము మీ గురువున కిచ్చి వేయుము.

నక్ష: హరిశ్చంద్రా! నే నిన్ని మాటలవాడను గాను.

క.అడియాస విడువు మిక నా
యొడలన్ జీవంబు లున్న వొదమిన్ విడువన్
జెడనెంచి తేని నినునా
బొడ నీ యడిదమున గోయ మీరో గొనుమీ.

హరి: నక్షత్రకా! ఇంతకన్న నేఁ జెడునదేమున్నది? నన్ను గూడ నమ్ముకొని మీ గురువు రుణంబు రాబట్టుకొనుము.

నక్ష: నిన్నెవ్వరిచ్చుట గొందురు?

హరి: ఎవ్వరు గొనకున్న గడకు గడజాతివానికైన నమ్మివేయుము.

నక్ష: సరి నిన్ను గాదననేల. (నడచును)

(ద్విపద - కీరవాణి రాగము - ఆది తాళము)
అవధారుడయ్య యో యగ్రజులార
సవన దీక్షితులార క్షత్రియులార
ద్రవిణేశు మించు నుత్తమ వైశ్యులార
ప్రవిమల గుణగణ్య పాదజులార
కడలాక్రమించి యొక్కట భూమి నేలి
సడినున్న యా హరిశ్చంద్రుడు నేఁడు
బానిసీడుగ నమ్మంబడుచున్న వాడు
మాననీయుడు సత్యమార్గ ధీరుండు
కోరిన ధనమిచ్చి కొనదగు సుండి
వారణాసి పౌరవరు లార రండి
(ఆకసమువంక జూచి) ఏమీ! ఇతడెట్టి వాడనుచున్నారా?

సీ.తన మహీరాజ్యమంతయు గాధిసూతికిన్
దాన మిచ్చిన యట్టి ధర్మమూర్తి
నిజ యశశ్చంద్రికల్ నిఖిల దిక్కులయందు
బారజల్లిన యట్టి సారగుణుండు
ముల్లోకములను సమ్మోదింప భేతాళు
మద మడంచిన విక్రమస్థిరుండు
అణుమాత్రమైన బొంకను మాట యెరుగని
యసమాన నిత్య సత్య వ్రతుండు
గీ.ఏడు దీవుల నవలీల నేలినట్టి
సాంద్ర కీర్తి హరిశ్చంద్ర చక్రవర్తి
బానిసీడుగ నమ్మంగ బడెడు కొనుడు

పౌరులార మహాధనోదారులార

హరి: ఎవరు కొనకున్నారు. ఇంకెంతని యరిచెదరు? వీడెవఁడో కడజాతి వానివలె నున్నాడు. ఇటె వచ్చుచున్నాడు. ఉండుము.(పిమ్మట వీర బాహు ప్రవేశించుచున్నాడు)

వీరబాహు: (గేయము)

తొలగిపోనిండయ్య! దొరలు పెద్దింటోణ్ణి
తెరచి చెప్పకుంటే పలువ పొమ్మంటారు ॥తొ॥
పబులు మీకుక్కల కట్టి వేస్కోండయ్యా ॥తొ॥
గబగబ బౌవంచు కరవ వత్తుండయ్యా
వాదనంటారు సూదోచ మంటారు నే
కాచంత కల్లేసి కాటికి పోతుండ ॥తొ॥

నక్ష: హరిశ్చంద్రా! ఇంక నిన్నెవ్వరు కొందురు?

వీర: దొరా! బానిసోణ్ణి అమ్ముతుండవా? నే గొంటానండీ, ధర చెప్పండి.

నక్ష: చెప్పెదను గాని నీవు దూరముగా నుండి మాట్లాడుము. నే నిప్పుడు స్నానము చేయలేను.

వీర: దూరంగానే వుండానుండి, చెప్పండి.

హరి: నక్షత్రకా! నన్నీ కడజాతి వానికే యమ్మెదవా?

వీర: కడజాతియేముంది, పెద్దింటోణ్ణి.

నక్ష: హరిశ్చంద్రా! ఎవ్వరు గొనకున్న నన్నేమి చేయమందువు? మొత్తము మీద నీవు నా కిచ్చు బత్తెమునకు దండుగ లేకుండ నా వలన బనిపుచ్చుకొనుచున్నావు.అరచి యరచి గొంతు పగిలి పోవుచున్నది. తిరిగి తిరిగి కాళ్ళు పడిపోవుచున్నవి.

హరి: అయ్యా! వీనికే విక్రయింపుడు. నే నన్నిటికి సిద్ధుడనై యున్నాను.

నక్ష: ఓరీ! వీరబాహూ! నీ కీతడు కావలయునన్న

క.దంతావళంబు పయి బల

వంతు డొక్కండు నిలిచి పైకిన్ రతనం
బెంతటి దవ్వుగ రువ్వునో
యంతటి యర్థం బొసంగుమా కొని పొమ్మా!

వీర: ఓరబ్బో! సాలదాకుండదే!
నక్ష: ఇక నేమనుకున్నావు? వీరబాహూ! నీచేత కాదు పోరా.
వీర: అయ్యోరూ! యిట్లుండానని సూత్తుండావు కామసు! డబ్బిత్తా రా, రావయ్యా అరిశ్చంద్రుడా.
నక్ష: హరిశ్చంద్రా! ఇకబొమ్ము. నీరుణము తీరినది.
హరి: నక్షత్రేశ్వరా! నేఁనిక సెలవు పుచ్చుకొనియెద. ఎక్కడనో నిశ్చింతతో దపం బాచరించుకొను నీవు గూడ నా మూలమున ఘోరారణ్యముల బడరాని పాట్లు పడితివి. క్షమింపుడు. వటూత్తమా! నమస్కారము.
నక్ష: (స్వ) అయ్యో! నే నిప్పుడేమని యీ ధర్మమూర్తికి బ్రత్యుత్తర మిచ్చెదను? ఇట్టి పరమ శాంతుని సత్యవంతుని నేనెంత జేసితిని.
(ప్రకాశముగా) హరిశ్చంద్రా! నేనే నీ కన్ని విధములఁ గష్టములఁ దెచ్చి పెట్టిన
దుష్టుడను. నేను నిన్నడుగు కొనవలసిన క్షమాపణములు నీవు నన్నడుగు కొనుచున్నావు.
అయినను బుట్టినదాది ననన్య సామాన్యమైన సత్యనిష్ఠాగరిష్ఠతచే బరిశుద్ధమైన
నీ మానసమున కింతటి క్షోభ దెచ్చి పెట్టిన నాయట్టి ఘోరకర్ముడు శిక్షార్హుండు గాక
క్షమాపణమునకు దగునా?
హరి: అయ్యో, విప్రోత్తమా! శిక్షించుటకు గాని, క్షమించుటకు గాని నేనెంతటి వాడను. వటుశిఖామణీ! నీకిదే వందనము.
(నమస్కరించును)
నక్ష: (లేవనెత్తి)

చ.కలత వహింపకయ్య కల కాలము కష్టము లుండబోవు కా

వలసిన కారణార్థము లవంబును దప్పునె? నా యకృత్యముల్
దలఁపున నుంచకయ్య విహితమ్ము నినున్ క్షమింపుమయ్య, నా
కలుషమె యింత కింత కధికమ్మయి నన్వధియింపకుండునే?

హరి: అయ్యా! మీరు చేసినదేమున్నది?నా పూర్వభవసంచిత పాపఫలమే నన్నీ కష్టంబులకు దెచ్చె.

నక్ష: రాజేంద్రా! నిత్య సత్య సంధుడవైన నీ కెప్పటికిని గష్టములు లేవు చూడు.

మ.కడకన్ గావలెనంచు సత్యఫలముం గాంక్షించి నీవే యొడం
బడి కైకొన్న విపత్తులం బరితపిం పన్ గూడదయ్యా కడుం
గడుదోసంబని నేనెఱింగియు వృథా క్రౌర్యంబునన్ నీ యెడన్
జెడుగు ల్సేయుట కెంత గుందితినొ నాచిత్తంబె తా సాక్షియౌ!

హరి: నక్షత్రేశ్వరా! దుఃఖింపకుము, పరమేశ్వరుడు నిన్ను రక్షించుగాక. వటూత్తమా! నాకింక సెలవొసంగుడు.

వీర: రావయ్యా! అరిశ్చంద్రుఁడా! కుండెత్తుకుంటావా!

హరి: అయ్యా, వచ్చుచున్నాను.

వీర: అరే అబ్బిగా! మద్దాసూ! ఇంటికాడికి మనోణ్ని తీసుకుపో, బామ్మడికి సొమ్మిప్పిస్తాను.

నక్ష: (స్వ) అయ్యో! నేనెంత కపట కృత్యముల నభినయించితిని? నన్నీ యకార్యమునకు నియమించునపుడు భగవానుడైన విశ్వామిత్రుడు నేనిట్టి రట్టునకు బాలగుదునని తలంపడయ్యె గదా! ఇనుమును బట్టి యగ్నికి సమ్మెట పెట్టనట్లే గురూత్తమా! మీ వలన గదా నేనిట్టిపని కొడిగట్టవలసి వచ్చె.మీ యాజ్ఞానువర్తినై నిత్యసత్యకీర్తి యగు హరిశ్చంద్ర చక్రవర్తికి లెక్కలేని
యిక్కట్టులఁ జేచేత దెచ్చిపెట్టి నేను మీకు జెల్లించవలసిన గురుదక్షిణ నిశ్శేషముగా జెల్లించు కొంటిని గాని నేనిప్పుడన్ని విధముల దిక్కుమాలిన వాడనై ప్రపంచమునకు రోసి

చావక బ్రతికియున్నాను. ఇంకను నాకు దపంబెందులకు? ఎన్ని మన్వంతరములు తపంబొనరించినను నా యీ దుష్కృతి నిష్కృతి యగుటెట్లు? హా దీనబంధూ!

గీ.గురుతిరస్కృతి తగదనుకొనుట యొకటి
యతని కార్యంబు నెరవేర్తుననుట యొకటి
యింత నిందకు నన్ ద్రోచె నేను జనిన
పాయ కది నిల్చు నెన్నిక కల్పములకైన

నే నిప్పుడేమి సేయుదు? నాకింక దిక్కెవరు? నా పాపంబునకు బ్రాయశ్చితమెద్ది? భగవానుఁడా విశ్వపతీ!

శా.ఏయే ధర్మము లాచరింప నగు నేయే క్షేత్రము ల్మెట్టనౌ
నేయే తీర్థములందుఁ గ్రుంక నగు నేయే దేవులం గొల్వనౌ
నాయీ పాపము దప్పిపోవుట కనంతా దీనబంధూ! కృపా
ళూ! యాపన్నుఁడ నీ వె దిక్కగుము కొల్తున్నిన్ను విశ్వేశ్వరా!

ఇంక దుఃఖించిన నేమి ప్రయోజనము? మా యుపాధ్యాయుడైనను దురుద్దేశముతో హరిశ్చంద్రుని బాధించుచున్నా డనుకొనను. తన వైరియగు వసిష్ఠుని సాధించుటకింత సేయుచున్నాడు. ఏది యెట్లున్నను మహానుభావుడైన హరిశ్చంద్రుని దుఃఖములు తలంచినచో వజ్రకాఠిన్య హృదయ ములు సైతము నవనీత సమానములు కాకపోవు. పాపమా లోహితాస్యుడా కాలకౌశికుని సేవానిర్బంధములో నెట్లున్నాడో! దైవమా! సర్వదా హరిశ్చంద్రునకు దోడుపడుము.

(ప్రకాశముగా) వీరబాహూ! ధనమిప్పింతువు గాని పద.

వీర: అయ్యోరూ రండి.(నిష్క్రమింతురు)

*ఇది పంచమాంకము.*

**సత్యహరిశ్చంద్రీయము - షష్ఠాంకము**

(రంగము : కాశీపుర స్మశాన పరిసరారణ్యము)

(పిమ్మట గాలకౌశికుని శిష్యులగు కేశవ జనార్దనులతో లోహితాస్యుడు ప్రవేశించుచున్నాడు)

(గేయము - పార్శీమెట్టు)

అందరు: ఆటలాడుదమా చెండ్లాటలాడుదమా
వాటమైన త్రొక్కుడు బిళ్ళాటలాడుదమా॥ఆట॥
చెట్టులెక్కుదమా లేక గుట్టలెక్కుదమా
అట్టు నిట్టు జీగురుబండలందు జారుదమా॥ఆట॥
కూఁత వెట్టుచు దాగిలిమూత లాడుదమా॥ఆట॥
ఆతరువు క్రింద గోలిలాటలాడుదమా॥ఆట॥

లోహి: మిత్రులారా!

గీ.ఆటలకు వేళలేదు సాయంతనంపు
టగ్నిహోత్రములకు వేళయయ్యె నిప్పు
డయ్యవారలు ముక్కోపులగుట మీకు
దెలియునేకద రండు దర్భలను గోయ.

కేశ: జనార్దనుడా! పాపము! లోహితాస్యుని కీనాడెన్ని దెబ్బలు తగిలినవిరా! అందుకే వీడు భయపడుచున్నాడు.

జనా: మనలను గూఁడ గొట్టునేమో రండు. తలకొకదారిం బోయి దర్భల బత్రముల గోయుదము. (అట్లు చేయుచున్నారు)

లోహి: (నడచి పూలగోసి) ఈ పూలతావి చక్కగా నున్నది. ఇవి మా కాలకంటికై తీసి కొనిపోయెదను. ఇదిగో నీ పుట్టమీద దర్భలు బాగుగా బెరిఁగినవి. అందరికంటే నేనే ఎక్కువ దర్భలను గోసెదను. (పుట్టనెక్కి కోయుచుండ పాము కరచును)
హా! తల్లీ! హా! మిత్రులారా! నన్నొక పెనుబాము కరచినది. (పడిపోవును)

అందరు: (పరుగెత్తుకొనివచ్చి) నెచ్చెలీ! నీకేమైనది?

లోహి: అన్నలారా! ఇంకేమి కావలయును? నన్నొక పాము కరచినది. ఇంక మాయమ్మను జూచుభాగ్యము నాకు లేదు.
కేశ: అయ్యో! అయ్యో! నీకెంత కష్టము కలిగెను? జనార్దనా! పాపము వీనికి మత్తు వచ్చుచున్నది. చెమటలు శరీరమునుండి యూరక కారుచున్నవి. నోట నురుగులు పడుచున్నవి. కొంతసడి విసరనైన విసరుదము. (అట్లే చేయుచుండ)

లోహి: (కొంచెము తేరి) అన్నలారా! చింతింపకుడు. నా యదృష్టమునకు మీరేమి చేయగలరు? మీ రిక్కడ నా మూలమున మసలవద్దు. మీకు మాట వచ్చును.

సీ.జాగయ్యెనని కొట్టునో గురుండట మిమ్ము
నిచట నుండక యింటి కేగరయ్య
అతిభక్తి మీకు లోహితుఁడంపినాడని
యీ కుశల్గురున కందీయరయ్య
సదయయై నారాక కెదురు చూచెడి తల్లి
కీ నాదుగతి వచియింపరయ్య
యేదిక్కు లేక నేనే లోకమని యున్న
జనని దుఃఖము బాపి మనుపరయ్య
వీలుగా నున్న గురు నొప్పుకోలుమీద
నమ్మ నొకసారి చూచి పొమ్మందురయ్య
విసము తలకెక్కె నేను జీవింపనయ్య
కడ కిదే మీకు నా నమస్కారమయ్య!

నెచ్చెలులారా! నా ప్రాణములు లేచిపోవుచున్నవి. మీరిక బొండు. హా తల్లీ! నీవైన నాదగ్గర లేకుంటివే?
జనా: అయ్యో! అయ్యో! ఎంతపని జరిగెను?
కేశ: మనమీద కేమి రాదుకద జనార్దనా!

జనా: మనము పోయి పాపమా చంద్రమతి కీ సంగతి నెఱింగింతము. మనమిక్కడ నుండి చేయునదేమున్నది?

(నిష్క్రమింతురు)

(పిమ్మట చంద్రమతి పిడక లేరుచు బ్రవేశించుచున్నది)

చంద్ర:

ఎంత మందభాగ్యురాలను. నిరంత మనంత పరిచారికా శతంబుల యూడిగంబు లందికొను

పట్టంపు రాజ్ఞీపదం బనుభవింపజేసి దైవమా తుదకీ నీచగతి కేల పాల్పరచితివి? తొలుతనే

నన్నీలాటి దాసిగ సృజియించిన నీవు నాకెంత యుపకార మొనరించినవాడ వగుదువు! ఈ దాసికావృత్తి యందైనను నా యజమానురాలిని మెప్పింప లేకుంటినే? హా! ప్రాణపతీ! హరిశ్చంద్రా!నీ విప్పుడెందున్నావో కదా! కాలకౌశికునికి నన్నొప్పగించునప్పుడు మనసార మన కష్టముల దలంచుటకైనను వీలు లేకపోయినను గడకు మందభాగ్యురాలనగు నేను

సీ.యజమానుఁడైన బ్రాహ్మణుని తీవరముచే
నింపార మిము గౌఁగిలింప నైతి
నిబిడాశ్రువుల దృష్టి నిలుపలేకుండుటచే
కనులార మిము జూచుకొనగనైతి
దుఃఖంబు పొంగి కుత్తుక బంటి యౌట నో
రార మీతోడ మాటాడనైతి
మసలినన్ వడుగుచేమాట వచ్చునటంచు
నొక్కింత మీదండ నుండనైతి
కడకు నన్నొప్పగించి యీ కర్మమునకు
ముందుఁ బోలేక పోలేక పోయినాఁడ

వెందునున్నాడ వేగతి నొందినాఁడ
విలను నున్నాడవో లేవో! యినకులేశ!

అక్కటా! శోకతీవ్రతచే యజమానురాలి యాజ్ఞను మరచుచున్నాను. ఇంక దొందరగా బిడక లేరవలయును. (ఏరుచు) ఓహో! సాయంకాలమై పడమటి కొండయందలి సంజకెంజాయ
విశ్వామిత్రుని కోపరసమో యన బ్రకాశించుచున్నది.
మరియు,

మ.కొడుకస్తం గతు డయ్యెనంచు దెలివిన్ గోల్పోవుచున్ గన్న ప్రే
ముడిఁ జింతించెడి లోకబాంధవునకై పూర్వాశ ప్రాణేశుఁడె
య్యెడకో పోయెనటంచుఁ బద్మిని సదాభృంగీరవ్యాపృతిన్
దొఁడగన్ మోముముడించి యేడ్వనెట బంధుత్యాగ మింతేకదా?

కాని వడుగులతోఁ గలసి యడవి కేగిన మా లోహితాస్యుం డింకను రాకున్నా డేమొకో? రావలసిన వేళ గూడ యతిక్రమించుచున్నది. అదిగో,

శా.ఆవుల్మందలలోన నిల్వకయె యంబాయంచు లేదూడలన్
ద్రావింపన్ దమచేఁపు బాలు వడి నిండ్లన్ జేరెడిన్ ముక్కలం
దేవో ధాన్యపుఁ గంకు లందికొని యప్డే గూండ్లకున్ జేరెనా
రావంబు ల్చెలంగన్ బులుంగు లకటా! రాడేఁమి నా పాపడే.

నేడే కారణంబుననో నామనంబు పరిపరివిధముల దపించుచు గీడునే శంకించుచున్నది. తొలుత కుర్రవానిని స్వామి యడవికి బంపునప్పుడు బాల్య చాపల్యముచే వాడు "నే నడవికిం బోలేనన్న" మాత్రమున ముక్కోపియైన కాలకౌశికుడు చబుకుం బట్టుకొని,

మ."చెడుగా యేపని చేతగానియెడ నాచే నౌనె ముప్పూటలున్
గడుపుబ్బ న్నిను మేప?" నంచుఁ దనువున్ గాయాలుగా గొట్టినన్

బడలేకా వ్యథఁ బ్రాణభీతి "గనుడమ్మా! చూడవే" యంచు నా
కడకేతెంచిన పుత్రు కష్టగతి నా గర్భంబు ఛేదించెడిన్.

దైవమా! ఎంత నీచ దురవస్థకుం దెచ్చితివి. ఏది యెట్లయినను గుఱ్ఱవాడింకను కంటపడలేదు కదా! చెడుదినములుగాన నామనంబు ప్రతిక్షణము శంకించుచునే యున్నది. (ప్రక్క జూచి) వారే వడుగులందరు వచ్చుచున్నారు. అక్కటా! కోసిన దర్భలు మోయలేక కుఱ్ఱవాడు వెనుకం జిక్కె కాఁబోలు!నేను వానికి సహాయము పోయెదను. (ఎదురుపోయి) ఏడి నా లోహితుఁడు?

బ్రహ్మచారులు మాత్రము గనపడుచున్నారు గాని నా ముద్దు లోహితుండు కనంబడడే?

(నలుగురు ప్రవేశింతురు)

కేశ: జనార్దనా! పాపము చంద్రమతి ఇక్కడనే యున్నదిరా?

జనా: అయ్యో! ఈ దారుణవార్త యేమని వచింతుము?

చంద్ర: అన్నలారా! మా లోహితుడెక్కడ?

(బ్రహ్మచారులు ఊరకుందురు.)

చంద్ర: ఏమి నాయనలారా? మాటాడరు? మరేమి యప్రియము లేదు కదా?

కేశ: జనార్దనా! చెప్పుము.

జనా: నీవే చెప్పరా.

చంద్ర: అయ్యలారా! మిమ్ము జూచిన నా కడుపు బ్రద్దలగుచున్నది. మీ ప్రియ మిత్రుడు లోహితాస్యు డేమయ్యెనయ్యా!

కేశ: అమ్మా! మేమే పాపకర్మ మెఱుగము. మేమందర మడవిలో దర్భలు గోయుచుండ "మిత్రులార! నన్నొక పెనుబాము కరచినది" యను మీ లోహితాస్యుని దీనారవము మాకు వినంబడినది. అంత మేము పోయి చూతుము గదా సర్పదష్టుడై మరణవేదన బడుచున్న నీ కుమారునిం జూచితిమి.

చంద్ర: హా! తండ్రీ! లోహితా! నే జచ్చితినిరా. (మూర్ఛిల్లును)

కేశ: అమ్మా! ఇంక గొంచెము చెప్పవలసియున్నది.

చంద్ర: నాయనా! ఇంకేమి చెప్పవలయును?
కేశ: అప్పుడు స్పష్టముగా లేని వాక్కులతో నిట్లు చెప్పినాడు.
చంద్ర: ఎట్లు తండ్రీ!
కేశ: ('జాగయ్యె' నను పద్యమును చదువును) అట్లు చెప్పినప్పుడు మరణవేదన పడుచుండె.
ఇప్పుడెట్లుండునో తెలియదు. ఎట్లయిన నీ కుమారుని నొక్కమారు చూచుకొనిరమ్ము.
ఇదిగో ఈ మార్గమున సూటిగా బోయితివేని నీ కొక వటవృక్షము గాన్పించును. దాని నీడయందే నీ నందనుండు పడియుండు. మేమింక బోయి వత్తుము. మాకచట మాట వచ్చును.
చంద్ర: అయ్యలారా! పొండు. నా దురదృష్టమునకు మీరేమి చేయుదురు?
(బ్రహ్మచారులు నిష్క్రమింతురు)
చంద్ర: హా! కుమారా! లోహితా! నీకు మృత్యుదేవతయై యా కాలసర్పమెక్కడ దాపురించెనోయీ
తండ్రీ! అడవి కేగునప్పుడు "నేను నడువలేకున్నను నన్ను గురుండు బలవంతముగా గొట్టుచు
బొమ్మను చున్నా" డని నీ వెంత చెప్పికొన్న నింటనే నిల్పికొన జాలని నేను నిన్ను జూడవచ్చుటకు మాత్రమెట్లు స్వతంత్రురాలనగుదును? కొడుకా! నీవునన్ను బూర్ణముగా విడిచి పెట్టితివా?

హా విధీ! పతివియోగముచేతనే యిదివరకు గృశించి కృశించి యెప్పటికైన మా హరిశ్చంద్రుని
చూడకపోదునా? యెల్లకాలము గష్టము లిట్లే యుండునా యను మొండి ధైర్యముచే నెక్కడనో

యొక్క ప్రాణముతోడ నీలాగు జీవించియున్న నాగర్భమున బుత్ర వియోగాగ్నియు దరికొల్పితివా?
నాకింక దిక్కెవ్వరు? హా! ప్రాణేశ్వరా! హరిశ్చంద్రా! నీ విప్పుడెక్కడ నున్నావు? కాలవైపరీత్యముచే
నీకుటుంబ మంతయు దిక్కుమాలి నేటికి జెట్టున కొక పక్షియై రాలిపోవలసి వచ్చెనే, అయ్యో!
దుఃఖభారముచే సేవాకృత్యమును మరచుచున్నాను. స్వామి యాజ్ఞంగైకొని కొడుకువడియున్న
చోటునకైనబోయి చూచివచ్చెదను. అమ్మా! కాలకంటకీ! నీవిప్పుడేమందువో?

కాలకం: (ప్రవేశించి, కోపముతో) ఓసీ, అంసనారీ! నీ విల్లు కదలి ఎంతసేపైనదే? పిడక లేరుకొని
రమ్మని పంపగా సుఖముగా నిక్కడ బ్రొద్దులు పుచ్చుచున్నావా? ఓసీ! నీకు మాసొమ్మెంత విషమైనదే! ఈ తీరుగా బనికొడలు దాచుకొని యింటికే ముఖము పెట్టుకొని తిండికి రావలయు ననుకొన్నావు?
చంద్ర: అమ్మా, కోపింపకుము. నేను మీ యానల శిరసావహించియే పని చేయుచున్నాను. నేడు
నా దురదృష్టము పండి దర్భలకై యడవికేగిన నా కొడుకును బాము కరచినదఁట.
కాలకం:ఓసీ,సూత్రధారీ!తొందరగానెందుకు బనిచేయవన్నందునకీ పన్నాగము పన్నినావు ఛీ! ఛీ!
చంద్ర: అమ్మా! నే నబద్ధ మెన్నటికి నాడనమ్మా! దర్భలకై పుట్టనెక్కగా నా కొడుకును బాము పట్టెనట.
కాలకం: ఎవరు చెప్పిరి?
చంద్ర: వెంటబోయిన వడుగులు చెప్పిరి.

కాలకం: అయ్యో! మాకు ధనవ్యయంబు గలిగింప నీవెక్కడ దాపురించితివే? బోలెడు ధనముపోసి కొనిన మేము నీ జీవనమునకు దేవుడాయని యేడ్వవలసి యుండగా నీకెందులకే యీ యేడుపు?

చంద్ర: అమ్మా! కన్నకడుపుగదా?

కాలకం: అట్లయిన నిప్పుడేమి చేయమందువు?

చంద్ర: కుర్రవాడు పడియున్న చోటకేగి చూచి వచ్చెదను. సెలవీయవలయును.

కాలకం: ఓసీ, నిర్భాగ్యురాలా! ఇంటిలో జేయవలసిన బనులెన్నియో ముందు బెట్టుకొని యెక్కడకో పోయెదననుటకు నోరెట్లాడెనే? నీవు పోయిన తరువాత నీ పని యంతయు నీ తాత యెవరు చేయును?ఊరక నోరుమూసుకొని నా వెంట రమ్ము.

చంద్ర: తల్లీ, కాలకంటకీ!

మ.కడ ప్రాణంబున నున్నవాడొ, విసమెక్కన్ జచ్చెనో కానలోఁ
గొడుకమ్మా! ననుఁ బంపకుండినను యోగ్యుండైన వైద్యుం ద్వరం
బడి యచ్చోటికి బంపుమమ్మ బ్రతికింపం జాలునేమో సుతున్
గడ కాళ్ళంటి నమస్కరింతు సుతభిక్షం బెట్టి రక్షింపుమా.

కాలకం: చాలు చాలిదివరకు దిన్నది చాలక మాసొమ్మింకను గుండము వేయుదువుగా! దర్భలకు
పోయినవాడు పుట్టలెక్కుట యెందులకు?పాము నోటికి గాలందీయఁగా గరవక ముద్దు పెట్టు
కొనునా! కరవకుండునట్లు దేశములోని పాముల కన్నింటికి వాకట్టు కట్టకుండుట మాతప్పా యేమి? నీ కొరకై వైద్యునెవ్వరి నిక్కడ సిద్ధముగా నుంచలేదు. మాకు మందులు చేతగావు. ఇంటిలో బనులన్నియు జక్కబెట్టి రాత్రి మమ్ము నిదురపుచ్చి నీ వెక్కడికైన బొమ్ము. (పోవుచున్నది)

చంద్ర: అమ్మా? నీ సెలవైనట్లే. (నడచుచు) హా! జీవితేశ్వరా హరిశ్చంద్రా! నీవుగూడ సేవా నిర్బంధమున లేవుగద! (అని నిష్క్రమించును)

(పిమ్మట నొక కుండ మూపుపై బెట్టుకొని హరిశ్చంద్రుడు ప్రవేశించి)

హరి:

స్వామి యగు వీరబాహుడు నన్ను "హరిశ్చంద్రుడా! కాదు, కాదు. వీరదాసుడా! నేటి రాత్రి యందు వల్లకాటియందు గావలియుండి, యుదయమున నింటికి వచ్చుచున్నప్పుడీ కుండ నిండ గ్రొత్తకల్లు నింపుకొని రమ్ము" అని యీ సురాభాండమును నాకిప్పించినాడు. ఆహా, సురా భాండమా! నీవు పూజ్యురాలవు. కావుననే, విశ్వామిత్రుని సహాయసంపత్తిచే విశ్వవిశ్వంభరాదేవికి నాస్థానంబగు నా భుజపీఠిపై నిట్లధిష్టించి యున్నావు. కానీ, నేనిప్పుడు శ్మశానవాటికకే వెళ్ళెదను. అంధకారమప్పుడే బ్రహ్మాండ మంతయు నావరించి కన్నులున్నవారిని గూడ గ్రుడ్డివాండ్రను జేయుచున్నది.

సీ.కలవారి యిండ్లలోపలి విధానము నెత్త
నరుగు దొంగలకు సిద్ధాంజనంబు
మగలఁ గూరుకనిచ్చి తెగి యంటుగాండ్రకై
తారాడు కులటల తార్పుగత్తె
అలవోక నలతి పిట్టలఁ బట్టి వేఁటాడు
పాడు మూకములకు బాడి పంట
మసనంబులోన నింపెసలారు శాకినీ
ఢాకినీ తతుల చుట్టాల సురభి
రేలతాంగికి నల్లని మేలి ముసుఁగు
కమలజాండంబునకు నెల్ల గన్నుమూత
సత్యవిద్రోహి దుర్యశశ్చవికి దోడు
కటికచీకటి యలమె దిక్తటములందు

ఇంక ద్వరపడి శ్మశాన వాటికకే పోయెదను.

(పిమ్మట శ్మశాన భూమి కాన్పించును)

అహో! ఈ శ్మశానంబునం దెచ్చట జూచినను,

సీ.కాఁబోలు బ్రహ్మరక్షస్సమూహం బిది -ఘోషించుచుండె రుక్కుల క్రమంబు
కాబోలు వీరు విగత జీవబాంధవు
లడలుచుండిరి మహార్త్తారవములఁ
గాబోలు వీరు టక్కరి భూతమాంత్రికుల్
నెమకుచుండిరి కపాలముల కొరకు
గాబోలు నిది పిశాచీబాంధవ శ్రేణి
పలలంపు బువ్వంపు బంతి సాగెఁ
జిట్లుచున్నవి కాఁబోలు చితులలోన
గాల్పఁబడెడు శవాల కంకాళ సమితి
నెటబెడీలను రవములే యొసగుచుండు
దిక్కులన్నిండ మార్మోగింత పిక్కటిల్ల.

ఎవరచ్చట! నాకెదురుగా నిలుచున్నారు. పిలిచి చూచెదను. ఓహో, ఎవరువారు?

గీ.కాటిసుంకంబు చెల్లింపకయె శవాల
మసనమున గాల్పరే కద మనుజులార?
కాపు లేదనుకొంటిరేమో పదండు
దళిత ఘోరారి యీ వీరదాసు గలఁడు.

(అని నడచి) ఓహో! ఎంతపొరబడితిని? సగము కాలుచు బరువులేక నిట్టనిలువున బైకిలేచిన యీ శవమును బ్రాణిగా భావించితిని. అయ్యో! ఈ కళేబరపు దుస్థితి యెంత జాలిం గొలిపెడిని.

శా.మాయామేయజగంబె నిత్యమని సంభావించి మోహంబునన్
నా యిల్లాలని నా కుమారుడని ప్రాణంబుండునందాఁక నెం
తో యల్లాడిన యీ శరీర మిపుడిందుం గట్టెలం గాలుచో
నా యిల్లాలును రాదు పుత్రుఁడును దోఁడైరాఁడు తప్పింపగన్.

ఇట్టి శ్మశానములం గనినపుడెల్ల నీలాటి వైరాగ్యములు కలుగుచుండుట సహజమే. ఇంక నా మంచె దగ్గరకు బోయెదను. (నడుచుచు) అయ్యో! దారి బొత్తుగా నిర్ణయింపలేకున్నాను. ఈ చేతిలోని కాష్ఠమును నేనిప్పుడు దీపముగా నుపయోగించుకొనియెద. (అని కొరవిం గైకొని) ఆహా, చక్రవర్తులకు సేవకాజనముపట్ల బంగారపుంగర దీపికలకంటె నా యిప్పటి నీచస్థితికి నీ కొరవియే మిక్కిలి యుచితమైనది.

శా.కాలంపుం గతి నెప్పుడేది యెటు భోగ్యం బప్పుడప్పాటనౌ
నాలీలన్ మును సేతు శీతనగ మధ్య ప్రాచ్య సామ్రాజ్య హే
లా లీలానుగతిన్ జరించి యిపుడీలాగైన నా ప్రాప్తికిన్
నాలో నాకొకభంగి నవ్వగు దురంతంబైన దుఃఖంబుతోన్.

మరియు,

మ.చతురంబోధి పరీత భూవలయ రక్షాదక్ష చామీకరా
యత దండంబు ధరించు నీ కరమె యాహా! యిప్పు డిక్కాటిలో
జితిలోఁ గాలుచునున్న నీ కొరవి దాల్చెన్ నవ్య మాణిక్య రా
జిత నీరాజన కాంతికిన్ బదులు వచ్చెన్ శోచనీయంబుగన్.

అయ్యో! ఈ కొరవి యిప్పుడే యారినది. పోనీ, పారవైచెదను.

(అని మెల్లగా నడచి) ఓహో! ఇదే శ్మశాన రాజ్యాభిషిక్తుడ నగు నా సింహాసనము(అని యెక్కి) నేనిక్కడ సోమరితనమున గూర్చున్న నిదుర వచ్చి స్వామి కార్యంబునకు భంగము కలుగదా, అయ్యో! నాకును నిద్రాహారములకును రుణముతీరి యెంతకాలమైనది?

సుగుణవతియు నా యర్ధాంగలక్ష్మియు నగు చంద్రమతి గొడుకుతో నొక్కనికి దాసిగా నెప్పుడమ్ముకొంటినో నాటితో నాకును నా సౌఖ్యమునకును రుణము దీరినది. మొండిపడి ప్రాణము మాత్రము వెడల పోకున్నది. ప్రాణము పోయిన నీ దుఃఖము లన్నియు నెవ్వరనుభవించు వారు? ఆహా! దైవోపహతుడనై నేనిప్పుడెన్ని విధముల బాధింపబడుచున్నాను.

మ.అకటా! యొక్కని పంచ దాసియయి యట్లల్లాడు నిల్లాలి పా
ట్లకునై కుందుదునా? సువర్ణమయ డోలాకేళికిం బాసి పొ
ట్టకునై రోసి తపించు నా కొడుకు జాడం గాంచి దుఃఖింతునా?
యిఁక నీ నీచపు గాటికాఁపరిని నాకే నేను శోకింతునా?

హా! హా! లోకములోనిఁ గష్టములన్నియు నన్నే కోరి వరించినట్లున్నవి? కాకున్న నిన్ని కష్టము లెవ్వరనుభవింతురు? అయ్యో! ఈ నిర్భాగ్యపు హరిశ్చంద్రుండు గతించిన వెనుక మరల గష్టములకు దావెక్కడ దొరుకునో. రాజ్య వియోగంబునకై దుఃఖింపను. మహారణ్యవాసాది ఘోరదుఃఖంబులెన్ని సంభవించినను గణింపను. కడకతి నీచంబగు నా యీ చండాల దాస్యంబునకు గూడ బరితపించను. కాని చేపట్టినదాది నన్నే పరమ దైవంబుగ భావించుచు నా మూలమున దనకంతలేసి కష్టములు సంభవించినను క్షమాగుణ సంపత్తిచే సహించుటే కాక తన్ను నొక్కనికిం దెగనమ్ముకొనుట నీచంబని నే సంకోచించునప్పుడు "నాథా! సత్యప్రతిష్ఠకై యొనర్చు నీచ కృత్యంబులు సగౌరవములే యగు" నని నాకు నుత్సాహము కలిగించి నా సత్యదీక్షం గాపాడిన నా యర్ధాంగ లక్ష్మి యగు చంద్రమతీ దేవి వియోగదుఃఖము నేనే గతి భరింతు?

హా దేవీ! అసూర్యంపశ్యా! నీ రాణివాస సౌఖ్యం బేమయ్యెను? అయ్యో! సాధ్వీమణీ! నీ పతి బ్రతికుండగనే నీవనాథవై యొక్కని దయకుం బాత్రురాలవు గావలసివచ్చె గదా! హా కుమారా! లోహితా! నిన్ను మరల నేనెన్నడు జూడ గలుగుదు? తండ్రీ! దాసదాసీ

జనంబుల చేతులనుండి యడుగటు వెట్టనీక మిగుల గారాబమున బెంచిన నిన్నిట్టి నిష్ఠురతమంబగు దాస్యంబున కొప్పగించితి కదా! అక్కటా! నాదుఃఖమంత కంతకు మితిమీరుచున్నది. కడచిన విపత్తు లొక్కటొక్కటిగ దలంపునకు వచ్చి నా ధైర్యమును మరింత మాపుచున్నది.

ఆహా! ఆనాడు భార్యాపుత్రులం గాలకౌశికునకు విక్రయించునప్పుడు "దాసీ! కదలవేమి!" అని యప్పారుడు తన తల్లి నడలించినాడని మా లోహితుఁడు "ఓరీ! మా యమ్మ నెక్కడకు గొనిపోయెదవురా!" యని తనపై నదరినాడని యా కాలకౌశకుడు నిర్దయుడై,

మ.కుడవం గూటికి లేకపోయినను నీకున్ రాజసంబెంత హె
చ్చెదురా! ఛీ! తలకెక్కెనే పొగరు దాసీ పుత్ర యంచున్ సుతున్
పడద్రోయన్ గొడుకట్టె నా వదనమున్గన్నీళ్ళతో జూచె హా!
కడుపున్ రంపపు గోతగోయునదియే గాయంబు గాకుండగన్.

అయ్యో! అట్టి దురవస్థనుండి సతీసుతులం దప్పింపలేక పోయితిగదా! నాకై గదా, రారాజు బిడ్డయగు నిల్లాలు దిక్కుమాలి పరులకొంపల జాకిరికత్తెయై యల్లాడుట, ఛీ! ఛీ! కఠినాత్మా, హరిశ్చంద్రా! నీ జన్మము నిజముగా నిరర్థకమైనది. చూడు.

సీ.విడలేక నీ వెనువెంట వచ్చెదనన్న
        పౌరుల దుఃఖముల్బాసినావో
సరిరాచబిడ్డయౌ సతిని నిల్లాలిని
        బ్రియ మారంగా సుఖపెట్టినావో
గడుపారఁ గన్న యా గొడుకును ముద్దుగా
        బెంచి ముచ్చటలఁ జెల్లించి నావొ
పుత్రవత్సలత నెప్పుడు నన్నుఁ బ్రేమించు

కులగురు నాజ్ఞలో మెలఁగినావొ

రవి మొదలుకొని నీదాఁక బ్రబలుచుండు
స్వకుల గౌరవములను గాపాడినావొ
చావకెందుకు ఛీ! హరిశ్చంద్ర! నీవు
బ్రతికియున్నావు జీవచ్ఛవంబ వగుచు.

అయ్యో! ఎంతవైపరీత్యము జరిగెను. ఎప్పటికైన శుభములు రాకపోవునా యను ధైర్యము గూడ నంతరించినది. బ్రతికి యున్నంతవరకు దేవికా దాస్యదుఃఖంబును, నాకీ కాటికాపరి యుద్యోగమును నవశ్యానుభోక్తవ్యంబులే కదా!

శా.నా దాసీత్వము బాపి యెప్పటికినైనన్ జింత లీడేర్పడే
నా దేవుం డను నాసతో నసువులన్భారంబుగా మోసి నే
నే దిక్కౌదని నమ్మియుండు సతి నాహీనస్థితిన్ గానమిన్
ఈ దౌర్భాగ్యపు గాటికాపరితనం బేపాటితన్ బ్రోచెడిన్.

అకటకటా! మందభాగ్యుఁడనైన నా చిత్తమునకు శాంతి యెప్పటికో! అయ్యో! ఇంక శాంతి గాకేమున్నది?

శా.నానాటన్ బరిపాటి నా మది దురంతంబైన చింతాహతిన్
మానై రాయయి వజ్రమై స్వగుణ ధర్మంబైన చైతన్య లీ
లా నైజంబుఁ ద్యజించి నిర్వికృతి మేళ్ళన్ గీళ్ళ నొక్కుమ్మడిన్
బూనున్ యోగి మనంబురీతి యపుడే పో శాంతి నా చింతకున్.

కావున నింక దుఃఖించిన మాత్ర మేమి ప్రయోజనము? సత్యస్థైర్యుఁడనైన నే నింక ధైర్యమునే వహింపవలయును. అయ్యో! ఏమిది? దుఃఖ ప్రాబల్యమున గర్తవ్యంబు మరచితిని. (శ్రుతి నభినయించి) ఎక్కడనుండియో యీ దీనారావంబు శ్రవణ గోచరంబగుచున్నది, పోయి చూచెదఁగాక!

(పిమ్మట నొక మూలనుండి చంద్రమతి ప్రవేశించుచున్నది)

చంద్ర: అయ్యో! ఈ యర్ధరాత్రమున నా కుమారుని జాడ నెవ్వరి నడుగుదును? దిక్కులేని నాకు బ్రకృతియే తోడు గావలయును.

సీ.జలదమా! సుంత మార్చలికిన దోసమా
యెరుగవా నీవు లోహితునిజాడ
పరుగెత్తకుము చక్రవాకీ! యేకడనైనం
గనుగొంటివమ్మ నా కన్నవాని
గాసంత మెరపించి మోసగించెదవేల
తోడురావమ్మ విద్యుల్లతాంగి
జలదపుఁ దెరఁబాసి వెలికి రండొక్కింత
తారలారా! నా కుమారు జూప

కానవా వాని గంగాభవాని? సుంత
గోల చాలించి వినుము నా గోడు కొంత
వేగమ గాన్పింపుమయ్య యో విశ్వనాథ!
నీ కుమారునిఁ బోలిన నా కుమారు.

అయ్యో! గతిచాలనివేళ నా మాట నెవ్వరు పాటింతురు? హా! సుతా, లోహితా! నీవెక్కడ నున్నావు, తండ్రీ! మునికుల పవిత్రా, గాధిపుత్రా! మమ్మెంతయైన సాధింపుము. ఒక్కమారు నా కుమారుని జూచుకొన నిమ్ము. (నడచుచు) ఏమిటి? కాలికి నేదియో మెత్తని వస్తువు తగిలినది. నా కుమారుని శరీరము కాదుకదా? (పరికించి) హా! లోహితాస్యా! నీ కెంతటి యవస్థ సంభవించెనురా? కొడుకా! పలుకవేమి? అయ్యో! ఇంతటి కంటకములచేత నిదివరకె నొత్తు కొనుచున్న నీ మృదుశరీరము కఠినంబగు నా

పాదతాడనంబు చేత నింకెంత బాధపడుచుండెనో తనయా! పుట్టిన దాది, యే కష్టము లెరుంగని నిన్ను గురుండ డవికి బంపుచుండగా నూరకుంటినని నాపై నలిగితివా?

లేకున్న నా తోడ నీ వేల మాట్లాడవు? నాయనా! శరత్కాల పూర్ణిమా రాకా నిశాకర బింబంబు విడంబించు నీ ముద్దు మోము చిరునవ్వు వెన్నెలచే నలరారుచుండ గనులార జూడకున్నను నమృత రసంబునకే లభింపరాని మాధుర్యంబు జిలుక నీ ముద్దు పలుకులు చెవులార వినకున్న బ్రతుకున కింకేమి యున్నది తండ్రీ? నేనింకెవ్వరిని జూచి పుడమిపై జీవించి యుందును, నాకింకెవరు దిక్కు? రాజ్యసుఖాద్యుత్తమ భోగంబులను బాసి చేసికొని పతికి దూరస్థురాలనై యొక్కయింట నూడిగంపుగత్తెనై కాలము గడుపు నీచస్థితికి వచ్చినను గడుపున బుట్టిన కుమారుడవు, సకల లక్షణలక్షితాకారుండవు, వంశైక విస్తారుడవు, నీ వొక్కడవు గట్టిగా నున్నాడ వంతియే చాలునని ప్రాణములన్నియు నీ మీదనే నెలకొల్పి బ్రతుకు చున్న నన్నిప్పుడే సముద్రమున ద్రోసి బోయెదవు. తండ్రీ! దాసదాసీ జనము లూపు బంగారు తూగు టుయ్యేలలపై సుఖ నిద్రంజెందు సౌఖ్యమప్పుడే యంతరించినను నీకు నా కాలకౌశికుని యింట బండుకొనుటకు నాపైట కొంగైన నింత యాధారము దొరకుచుండునే! నేడేదియు లేక దట్టముగా యుండుటచే నిండియుండిన యీ నట్టడవిలో నీ యర్ధరాత్రమున నిట్లొంటి నిద్రించుచుంటి వేమోయీ? కొడుకా! లోహితా! నీకు నేటికి గులకరాల నేలయే పూలపాన్పయ్యెనా? అయ్యో! క్రూరసర్పమా! నే నిన్నేమందును? నిష్కారణముగ నా కుమారుని జంపితివి. ఛీ! సర్పాధమా?

మ.పని యేమున్నది నిన్ననన్ నడకలా వక్రంబు లే ప్రొద్దు నీ
వనిలో ఘోరవిషంబు గ్రక్కుట జగత్ప్రాణాశనోద్వృత్తి పె
ట్టిన పేరే యదిగాక నాలుకలు రెంటిం దాల్చినా విట్టి నీ
కనుకంపా గుణముండునన్న నెటు సాధ్యంబౌను దర్వీకరా!

అయ్యో! శోకాతిరేకముచే నీ పామును దూషించు చున్నానేమి? ఇప్పటికి రాత్రిలో మూడవ జాము జరుగుచున్నట్లున్నది. తెల్లవారక మునుపే గంటికి గన బడకున్న దొరసాని యూరకుండదు. కొడుకా! ఇంక నీ నవమన్మథాకారమును జూత మనుకొన్నను సంభవింపదే యని యిప్పుడే తనివి తీర జూచుకొనుచు నీ శవము కడ దడవు నిల్చుటకైనను నిప్పుడు స్వతంత్రురాలను గాకుంటినే? నాయనా! రమ్ము, లోకాచారముల ననుసరించి నిన్ను జేతులార గాటికప్పగించి చేతులు గడుగు కొని యెద. (ఎత్తుకొని) అయ్యో! ఇప్పుడు స్మశాన వాటికకు నేదారియని పోయెదను? పుత్రశోకంబున నావరింపబడిన హృదయము వలెనే బ్రహ్మాండ మంతయు నంధకార బంధురంబై యున్నది. లోహితాస్యుండను నా బాల సూర్యుడస్తమించిన వెనుక లోకమున నంధకారము గాక యింకేమున్నది.

(నడచుచు) ఆ వంక నేదియో వెలుతురు గాన వచ్చుచున్నది. నరసంచారము లేని యీ కాంతారమున నే మానిసి యలికిడి లేకపోయినను, దిక్కులన్నియు వ్రక్కలగునట్లు పిక్కటిల్లుచున్న గంగానదీ ఘోషంబులును నీ నట్టడవి యందలి ఝుల్లీ నినదంబులును నా గుండెలు బ్రద్దలగునట్లు చేయుచున్నవి.

(నడచుచు) ఆ వెలుతురున్నచోటె స్మశానవాటిక కాబోలు! ఆ ప్రక్కనే నడచెదను. అహో! ఇదే స్మశానవాటిక. అయ్యో! సాహసంబు చేసి ఇచ్చటికి వచ్చితిని. ప్రాణంబులకు రోసిన నాకు సాహసంబు గాక ఇంకేమున్నది? కులవర్ధనుడగు నీలాటి కొడుకిట్లు కాటిపాలైపోయిన వెనుక నేనింకను బ్రతికియేమి ప్రయోజనము తనయా! నీ విచ్చట బండుకొనుము. నీ దహన కార్యమునకై నిన్ని చితుకులైన బోగుచేసెదను. (అట్లు చేయుచు) ఆహా! ప్రాణపతీ! ఇట్టి కష్టకాలమున గూడ నీవు దగ్గరలేకుంటివే.
(ప్రవేశము - హరిశ్చంద్రుడు)
హరి:

గీ.హృదయమున దుఃఖమింతేనిఁ పదిల పడదు
మరతు నన్న సతీసుతుల్మరపురారు
కంటి కిదియేమొ పలుమారు కానిపించు
నెక్కడో యున్న నాదు లోహితుఁడు నేఁడు

చంద్ర: హా! సుతా! నన్ను వదిలిపోతివా?

హరి: అహో! ఎక్కడిది యీ దీనారవము. ఇది పరికింపగా సతీ కంఠస్వరంబుగా నున్నది, కాని పురుషునిది కాదు. పాపమా మందభాగ్యురాలెవరో పోయి చూచుట మేలు.

(నడచుచున్నాడు)

చంద్ర:

హా! కుమారా నాకు నేటితో సర్వాశా పూర్తి యయ్యెనుగా తండ్రీ! నీ దహన కార్యమునకు దుదకు గట్టెలకుగూడ గతిమాలి నీ తల్లి యల్లాడవలసివచ్చెనే. (శవము నెత్తికొని) హా, పుత్రా! నీకు నేనెంత ఘోరము జేయ సాహసించితిని.

మ.చనుఁ బాలిచ్చినతోడనే నిదుర బుచ్చన్ బొత్తులందుంచి య
ల్లన జోకొట్టుచు నొక్కకేలఁ బెరకేలన్ డోలికం బట్టి యూ
చిన నీతల్లియె యిప్పుడీ చితిపయిన్ జేసేత నిన్ జేర్చి హా!
యని దుఃఖించెడు దిక్కుమాలి కొడుకా యన్యాయమింకేమనన్

నాయనా! రాజాధిరాజ కుమారుడవైన నీకు గాలవశమున గష్టములు వచ్చినను జనిపోయిన వెనుకనైనను నీ దహన విధి యథావిధి జరుగక యీ వల్లకాటి యందెవ్వనిదో యొకని చితిలో సగము కాలిన యల్పకాష్టముల నీకాధరములయ్యె గదా! నవమాసములు మోసి, కని, ముద్దుముచ్చటలం బెంచిన నీ కన్నతల్లియా నీకు గడకు దల కొరవి నిడుట. ఛీ! ఛీ! చంద్రమతీ! నీ వెంత రాకాసివి! ఈ దుఃఖమున నీపతికి దావీయక నీ వొక్కతె నిట్లనుభవించుటకు నీ జన్మంబెంత దౌర్భాగ్యపు జన్మము.

(కొరవి చితి నంటించుచున్నది)

హరి:

(సమీపించి, స్వగతము) ఓహో! నా యాజ్ఞలేకుండగనే నిక్కడ జితి గూడ బేర్చినదే.

(ప్రకాశముగా) ఓహో! ఎవ్వతె వీవు?

స్రగ్ధర: పడతీఁ యేకాకివై నిర్భయమున నిటకున్ వచ్చి నా యాజ్ఞ లేకీ
నడిరేయిన్ వల్లకాట న్శవ దహన విధి న్సల్పుచున్నావుగా! ఛీ
చెడుగా చాల్చాలు పోపో చెడెదవు తగునే చేడె కీకృత్యముల్ నా
కడనా నీ మ్రుచ్చు వేసాల్కదలు కదలుమా కాదు నీ యబ్బ సొమ్మా!

(అని చితిం గూలదన్ను చున్నాడు)

చంద్ర: అయ్యా! ఇప్పుడు గూడ నెంత పరాభవము జరుగుచున్నది. హా ప్రాణపతీ! ఇట్టి యవస్థయందు నీవు సహాయపడుటకు నా యండ నుండ వైతివే!

హరి: (స్వగతము) ఏమి? పతివిదూరయా? ఎవతెయో కాని,

గీ.ఈ నెలంత సుశీలగా గానిపించు
గారణాంతరమున నిట్టి కష్టదశను
జెందినట్లున్న దదికాక ముందు నేను
విన్నదియు గానే యున్నది వెలది స్వరము.

అయినను విచారించిన దప్పేమి?(ప్రకాశముగా)

మ.పడతీ యెవ్వతెవీవు? ఊలుగరగన్ వాపోవుచున్నావు నీ
కొడు కెద్దాన గతించె? నెవ్వరున్ నీకుం జుట్టముల్ లేరే యీ
నడిరే యొంటిగ నెట్లు వచ్చితి శ్మశాన క్షోణికిన్? జిత్ర మ
య్యెడు నీరీతి వచింపు మేడ్చి ఫలమేమీ! యూరటం బొందుమీ.

చంద్ర: (స్వగతము)

గీ.అరయ నితడొక మహనీయు డట్లు తోచు
నీతని వచోవిధం బెన్న నేమొ కాని
పరిపరివిధంబులను బారు హృదయవృత్తి
యింత దుఃఖంబునన్ గొంత శాంతి వొడము.

ఏమైనను నిప్పుడు మౌనము వహించిన గార్యము నెరవేరదు కాన నిట్లు మాట్లాడెదను.

చ.పురుషవరేణ్య! నీ వెవఁడవో యెఱుఁగన్ మసనంబు లోపలన్
దిరిగెడు భూతనాధుడవొ దీనదశాకలనన్ గృశించు నన్
గరుణ ననుగ్రహించుటకు గా నరుదెంచిన సిద్ధమూర్తివో
పరమదయాబ్ధి నే నవని పైఁ గొరగాని యభాగ్య దేవతన్.

హరి: మానినీ! నే సిద్ధుండ గాను, భూతేశుండ గాను. ఈ వల్లకాటికిం గావలి గాయువాడను.
కాని సాహసము చేసి యీ యర్ధరాత్రమున దోడులేక యిక్కాటికెట్లు వచ్చితివి? నీ చరిత్రయేమో
యెరింగింపుము. వచ్చిన కష్టము లనుభవింపక తీరదు కదా!
చంద్ర:

మ.అనఘా! ఎంతని విన్నవింపగలనయ్యా! రోళ్ళరోకళ్లదా
బాడిన నాదీన చరిత్ర మెల్ల నొకపాడిన్ జేసి యీ దేహమొ
క్కని సొత్తొట దలంచి ప్రాణముల బిగ్గంబట్టుటేకాక యే
మని జీవింతును దిక్కుమాలి కడుహేయంబైన దాస్యంబునన్?

పూజ్యుడా! ఈ దీనురాలికి నిప్పుడెవ్వరు తోడురాఁ గలరు? చూడు,

సీ.కొడుకా! యటంచు నా పడు నవస్థకు జాలి

గొని యేడ్చు నలదిశాంగనలె తోడు
తన జంటంబాసి మింటను గూవు కూవు మంచు
శోకించు నల చక్రవాకి తోడు
ననుఁ నూరడింప హోరని యేడ్చు లోక పా
వనియగు గంగా భవాని తోడు
నను జూచిఁ బొటబొట మని మంచు కన్నీరు
లగార్చు తీవెయిల్లాండ్రు తోడు
ఆపదలకై వారి నా యన్న వారి
దిక్కులేనట్టి నా వంటి దీనసతికిం
గాశీ విశ్వనాథుడే కలడు తోడు
కడమ తోడేడ నాకు నో కాటిరేడ!

మహానుభావుడా! నీవు నాకు గడు బూజ్యుడవుగా దోచుచున్నాడవు. నేనీ కాశీ పురంబున నొక బ్రాహ్మణుని యింట దాసిని. నా పేరంసనారి యందురు. ఈ చనిపోయినవాడు మదేక పుత్రుడు, వీనిని నేటి సాయంసమయమున

చ.అడవికి బోయిఁ గట్టెల గుశాదుల దెమ్మను రేని యాన ని
య్యెడ కరుదేర నాదు దురదృష్టముచే బెనుబాముచేత నీ
కొడుకున కీ నవాంగనజునకున్ మరణమ్ము ఘటిల్లెనయ్య నా
పడు దురవస్థ యేమనుచు బల్కుదు? దుఃఖము పొంగి పొర్లెడున్

హరి:

(స్వగతము) ఏమిది? ఈ మానినిం జూచినప్పటి నుండియు నా హృదయ మకారణముగా దుఃఖ సంకులం బగుటయే కాక విశేషించి

ఉ.ఈ యలివేణి నోట వచియించెడు నొక్కొక్కమాట యొక్క వ
జ్రాయుధమై పెకల్చెడు శిలాకృతియ గాంచిన నాదు మానసం

బీయమ మాటపొందికయు నెల్గుఁదెఱంగు యుదంతమెల్ల ని
స్సీ యనరాదుగాని స్పృహియించును జంద్రమతీ సతీ మణిన్

అవిగాక యిక్కాంత కష్టోదంతంబెల్ల మందభాగ్యుండనైన నాకే తగిలి వచ్చుచున్నది. చనిపోయిన యీ కుఱ్ఱడు మా లోహితుడు కాదు గదా? ఛీ! ఛీ! నా పాడు తలంపున కెట్టి దురూహ పొడమినది? కొడుకా! లోహితా నీకమంగళము ప్రతిహతమగుగాక. ఇంక నా వెడగుదలంపుల మానివేసి నా విధియందు నే నప్రమత్తుడై మెలంగెద.

(ప్రకాశముగా) ఓ మానినీ! నీవెవ్వతవైన మాకేమి గాని, నా యాజ్ఞ లేకుండ నిక్కాటి కీశవమేల కొనివచ్చితివి? ముందు చెప్పుము.

చంద్ర: పూజ్యుడా! శవదహనమునకు గూడ నౌకరి యాజ్ఞ కావలయునా?

హరి:

ఏమీ! బొత్తిగా నిచ్చటి కాటిచట్టముల గుర్తెఱుంగకున్నావే! ఎవ్వరు గాని దహింపవలసిన శవమును దెచ్చి ముందు మాకు జూపి, చెల్లింప వలసిన సుంకమును చెల్లించిగాని దహనకార్యం బుపక్రమింపరు. నీవు బలు తెగువ దానివిలా గున్నావు కాని

ఛ.పదపద యిప్పటికైన దెరవా! తడవయ్యెను మాకు నేల ని
ల్చెదవిఁక? నీ కుమారుని కళేబర మావల బారవైచునం
త దనుక బోవె? శూలినయినన్ దలగోయక యూరకుందునా
ముదితవుగాననే బ్రతికిపోయితి వింక దొలంగు మిచ్చటన్.

చంద్ర: ఓ దయామయా! ఎరుగక చేసిన నా నేరమును మన్నింపుము. నేనిప్పుడు శరీర మాత్ర విభవనై యున్నాను. విప్రు నింట నూడిగము చేసి కొనినగాని, గ్రాసవాసంబులు జరుగని నిరుపేదరాలను, నేనే మూలమున గాటి సుంకమునుఁ జెల్లింపగలను?

హరి: (స్వగతము) అకటా! నేనెంత కాఠిన్యము వహింపవలసి వచ్చెను.

(ప్రకాశముగా) మానినీ! నీవు పేదరాలవైన మాకేమి? భాగ్యవంతురాలవైన మాకేమి? భాగ్యమున్నను రావలసిన సుంకము కంటె నెక్కుడు మేమపేక్షింపము. మాడ యొకటి, పిండంబు, దండులంబులును, నొక పాతయు మా కిచ్చినంగాని నేనీ శవమును దహింపనీయను. నన్ను గఠినాత్ముండని యెంచినను సరే, కులధర్మంబు వీటింబుచ్చి యీ రీతిం గాటి కాపరితనముచే
జీవించు నీ చండాల దాసునకుం గరుణ యెక్కడిది? పొమ్ము.
చంద్ర: అయ్యో! ఎవ్వరైననేమి? దీనరక్షణము తప్పుగాదు కదా!
హరి: తప్పో యొప్పో మాకడ జెప్పకుము. పొమ్ము శవమును బార వైచెద చూడుము. (అని పారవైవ బోవును)
చంద్ర: అకటకటా! ఎంతటి కాని కాలము సంభవించినది. విశ్వవిశ్వంభరా చక్రంబున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యము వహించి యశ్రాంతంబు పాదాక్రాంతులైన సామంత భూకాంతులకోటీర మణిఘృణీరావంబులచే విరాజిల్లు పాదయుగళముల చక్రవర్తికి గుమారుడై కడకీ కాటిలో జేరెడు నేలకేని స్వతంత్రుఁడగుటకు నోచుకొనక పోయెనుగా! కొడుకా! నీ ప్రారబ్ధంబున కెంతని విలపింతు?
హరి: (స్వగతము) ఈ బాలుండెవ్వడో మహారాజు కుమారుండని విస్పష్టమైనది. నేనింక నేమని తలంపను?
వీడు నిశ్చయముగా మా లోహితాస్యుడేమో? నిస్సంశయుగా బేరు తెలియకయే నే నేల కీడునే యూహింప వలయును? తండ్రీ! లోహితాస్యా! నీకు దీర్ఘాయురారోగ్యములు గలుగుగాక! వీడెవ్వ డైన నేమి? నా విధి యందు నేనొక విధముగా బ్రవర్తింప రాదుగదా! (ప్రకాశముగా)

ఓ కాంతా! నీవెంత యేడ్చినను నేను గరుణింప జాలను. నీ యుదంతం బంతయు గడు నద్భుతముగ నున్నది. చనిపోయిన వీడు రాజకుమారుడైనట్లు నీ యేడుపు వలన

దెలియవచ్చినది. నిజముగా నీవు రాచదేవేరివేయైనచో మా కీయవలసిన కాటిసుంకము నీకడ లేకుండునా!

చంద్ర: అయ్యో! కాలవైపరీత్యమున నుత్తమ పదవిం బాసి యిప్పుడు నేను శరీర మాత్రవిభవనై యున్నానని యిదివరకే విన్నవించుకొంటినే, నీ కేల దయ రాదు?

హరి: నేనిది బొత్తిగా నమ్మను.నీ కిప్పుడున్న విభవము శరీరమాత్రమే కాదు.ఆలోచించుకొనుము.

చంద్ర: అయ్యో! ఇంకేమున్నది?

హరి: ఏమీ! ఇంకేమీ లేదా? చూడు,

మ.దళమౌ పయ్యెదలో నడంగియు సముద్యత్కాంతు లీరెండలన్
మలియింపన్ దిశలన్ ద్వదీయ గళసీమన్ బాలసూర్యప్రభా
కలితంబై వెలుగొందుచున్నదది మాంగల్యంబు కాఁబోలు! నే
వెలకైనం దెగనమ్మి నీ సుతునకై వెచ్చించినన్ జెల్లదే?

చంద్ర: (ఉలికిపడి) అయ్యో! దైవమా! రెండవ సురజ్యేష్ఠుండగు వసిష్ఠ మహర్షి ప్రభావంబుచే నా పతికి దక్క నన్యులకు గోచరంబు కాని నా మంగళసూత్రం బొక్క చండాలుని కంట బడెనా! కాదు కా దీతడు నా పతి హరిశ్చంద్రుడే. (అని కౌగిలించుకొని) హా! జీవితేశ్వరా! హా! విశ్వంభరాఖండ రాజ్య ప్రదాన సందర్పిత కౌశికా! హా! వసిష్ఠ ప్రియశిష్యా! హా! సార్వభౌమలలామా! హా! సత్యప్రియా! హా! హరిశ్చంద్రా! నేనే మంద భాగ్యురాలనగు నీ జీవితేశ్వరిని, చంద్రమతిని.

ఎల్లప్పుడల్లారు ముద్దుగా బెంచిన నీ వంశాంకురంబగు నీ కుమారుడు లోహితాస్యుడీ కాటిలో గులకరాలపై నెట్లు పండుకొని యున్నాడో యొక్కమారు కన్నెత్తి చూడుము. ప్రాణపతీ! రాజరాజకోటీరమణి మంజరిమంజరిత పాదాంభోజుడగు నీకా యీ కాటికాపరి తనము? అకటకటా! దురవలోకనంబగు నీ ప్రేతాలయంబే నీ కయోధ్యాపురం

బయ్యెనే? కరకు గలిగిన నులకత్రాళ్ళచే నల్లబడిన యీ మంచెయే నీకు నవరత్న సింహాసనం బయ్యెనా? భయంకరం బులగు నీ భూతభేతాళ పిశాచ గణంబులా నీకు భట సముదాయము? శవనికరంబుల దహించుచుండిన సొదగుంపా నీకు చరదీపికా సహస్రములు?

నాథా! నీ రాజసం బెందు బోయినది? నీ తేజంబెందు దాగినది? జీవితేశ్వరా! అశ్రాంతంబు పాదాక్రాంతులై నమస్కరించు సామంతులెల్ల నీ కిప్పుడేల యడుగులకు మడుగు లొత్త కుండిరి! కరపల్లవంబుల బంగారు పళ్ళెరంబుల బట్టి పురంధ్రీ జనంబు నీకేల నీరాజనంబుల నెత్తకుండె! నీ సత్యసంభాషామనీషం గురించి ప్రబంధముల నుడువు వందిమాగధ జనంబెందు బోయె! రాజచూడామణీ!

సీ.పసిడిమేడలలోన వసియించు ప్రభునకా
కటకటా! యీ వల్లకాటి వసతి
కనుసన్న దొరలచేఁ బనులందికొను మీక
యీ నికృష్టపు మాలవాని సేవ!
అలరు దేనియలతో నారగించెడు మీకా
యకట! శవాల పిండాశనంబు
జిలుగు బంగారు దుస్తుల ధరించెడు మీక
పొలుసు కంపొలయు నీ బొంతకోక!

కనుల మీ యిట్టి దుస్థితిం గనిన నాకు
జావురాకున్న దెంతని సంతసింతు!
హా హరిశ్చంద్ర! సార విద్యాఫణీంద్ర
బుధజన మనశ్చకోర సంపూర్ణచంద్ర!

ప్రాణేశ్వరా! మన విపత్పరంపరకే నాటి కంతము లేక పోయెనే? నన్ను విక్రయించుటచే విశ్వా మిత్రుని రుణబాధ నిరవశేషముగా దొలంగి యెక్కడనో మీరు కొంత సుఖముగా నున్నారని దలంచితి గాని నాకు సంభవించిన దాస్యమున కంటె వేయిమడుంగు లెక్కుడు నీచంబగు నీచండాల సేవావృత్తియందు జిక్కియున్న మీ కడకు జనిపోయిన లోహితాస్యుని కళేబరముతో నిటుల వచ్చెదనని యొక్క నాడు దలంపనైతినే? నృపసార్వభౌమా! ధైర్యము వహించి యొక్క మాటైన నాడుము.

హరి: ఏమీ! నీవు చంద్రమతివా? అయ్యో! వీడు నా కొడుకు లోహితాస్యుడా! (కుమారునెత్తుకొని)

శా.హా! సూర్యాన్వయవార్ధి కౌస్తుభమణీ! హా! సద్గుణాంభోనిధీ!
హా! సౌందర్యనిరస్త మన్మథశతా! హా! పూర్ణచంద్రాననా!
హా! సల్లక్షణ లక్షితాంగ లలితా! హా! మత్తభృంగాలకా!
హా! సేవాపరతోషిత ద్విజమణీ! హా! లోహితా! హా! సుతా!

తండ్రీ! పలుకవేమి? నిన్ను దుస్సహంబగు సేవకావృత్తి కప్పగించిన కిరాతుండైన నిన్ను గన్న తండ్రిని నన్నొక్కమారు రెప్పలెత్తి చూడుము, నాయనా! నీవప్పుడే స్వర్గయాత్రం బట్టుటకు నీకేమి నూరేండ్లు నిండినవా, కొడుకా! లోహితా?

సీ.మోయలేదింకను మూఁపు కాయలుగాయ
సర్వ సర్వంసహా చక్రతలము
ప్రాయలేదింక గర్వాయత్తుల జయించి
యఖిలదిక్కుల విజయాక్షరముల
నిలుపలే దింక సత్కులకాంతను వరించి
సింహాసనమున నీ చిన్ని సుతుని
సలుపలే దింక నిర్జరకోటి మెచ్చఁగా
నశ్వమేధాది యజ్ఞాదికములఁ

గన్న తల్లిదండ్రులగు మాకు నిన్ని నీళ్ళు
విడువవలసిన పనిగూడ నడుపలేదె
యిన్ని పనులున్నవే నీకు మన్నెఱేఁడ!
యెందుకీ జాడ? లేచిరా యందగాడ!

చంద్ర: జీవితేశ్వరా! ఇకనెక్కడి కొడుకు! మీరు ప్రాకృతునివలె శోకాంధకారంబున మునుంగ దగదు. ముందు జరుప దగిన కుమారుని దహనవిధి కుపాయమేదైన నున్నచో బరిశీలింపుడు. బ్రొద్దుబొడువకమున్న పోయి కంటి కగపడకున్న మా దొరసాని కాలకంటకి యాజ్ఞనుల్లంఘించిన దాననగుదును.
హరి: దేవీ! నిర్భాగ్యుఁడనై చండాలదాస్యంబున బొట్టపోసికొను నేను నీకే యుపాయమున సహాయము చేయగలను? చెప్పుము?

ఉ.అందరి కెట్టివో స్వవిషయంబున నట్టివె కాటి చట్టముల్
నందనుడంచు వీని గరుణం గని యేలినవాని యాన మీ
రందగునా? సతీ కనికరమ్మున కింత యెడమ్ము లేదు మా
డం దొర కీక యిప్పు డిచటన్ జితి బేర్చుట కేను కర్తనే?

కావున నెట్లయిన మీ దొరసాని నడిగి మా స్వామికీయవలసిన మాడయుం బాతయు సంపాదించుకొనిరమ్ము. ఇప్పుడు నా చేతనైన సహాయము నాకిందురావలసిన పిండాశనము మానుకొనుట దక్క వేరొండులేదు.
చంద్ర: హా! విధీ! యెంతవాని కెంతటి దురవస్థం దెచ్చి పెట్టితిని? నాథా! యిట్టి యిక్కట్టులందును మీరు ధర్మపథంబు దొలగనందులకు నాకు సంతసమే కలుగుచున్నది. నేను మాదొరసాని కడ కేగి మాడయు బాఁతయు నడిగెదను. ఆవిడకా కాసంత దయగూడ గలుగకున్న విధి యెట్లు విధించెనో యట్లగు గాక!

హరి: శీఘ్రముగ బొమ్ము. అంతదనుక. గుర్రవాని కళేబరము నే జూచు చుండెద.

(చంద్రమతి నిష్క్రమించును)

హరి:

(కుమారుని ముందుంచుకొని) హా! హా! ఎంతఘోరము సంభవించినది? కొడుకా, లోహితా!

మ.చతురంబోధి పరీత భూతధరిణీ సామ్రాజ్యసర్వస్వ సం
తత ధౌరేయుండవయ్యు నీ వొకని యింటం గూటికై బంటవై
యతి నైచ్యంబు వహించి దిక్కు సెడి యిట్లైనాడ వేమందు నీ
బ్రతుకీ నాటికి తెల్లవారె గద పుత్రా యిన్ని బన్నాలతోన్.

తండ్రీ! నీ ప్రాణమునకా కాలసర్పమెక్కడ దాపురించెను? నిన్ను గన్న తల్లిదండ్రులెన్నో దుఃఖంబు లనుభవింప రాళ్ళవలె బ్రతికియుండ నీవు దిక్కులేక యేకాకివై తుదకిట్లు దుర్మరణంబు పాలైతివే?

శా.నిన్నా పన్నగ ముగ్రతం గరవ దండ్రిం దల్లిన్ జీరియే
మన్నావో యపుడెంత బాధపడితో హా! పుత్రకా! నాకునై
యెన్నో బన్నములందినావు తుదకిట్లేకాకివై పోవ నే
గన్నారం గననైతి నీ యెడ గృతఘ్నృత్వంబు పాటించితిన్.

ఇంక దుఃఖించి యేమి ప్రయోజనము. నీవు దీర్ఘాయుష్మతుడ వగుదువని నుడివిన కాలజ్ఞుల పల్కులే నిక్కంబు లగునేని నీకిన్ని కష్టములు రాకుండు. కాటిపన్నునకై పోయిన దేవి యింకను రాకున్నదేమి? దెల్లవారినదే? ఏమా కలకలము?

(తెరలో గలకలము)

ఓహో పురజనులారా! మన రాజుగారి యింట దొంగతనముచేసి ధనాశచే రాచబిడ్డం జంపిన యీ శిశుహంత్రిని దలఁగోయవలసినదిగా రాజాజ్ఞయైనది కనుక దీనిని వధ్యశిల యొద్దకు దీసిగొనిపోవుచున్నాము.

హరి: (ఆకర్ణించి) రాజభటులిక్కడికే వచ్చుచున్నారే!

భటు: (ప్రవేశించి) ఓయీ, వీరదాస! రాజు నాన మేరకీ బాల హంత్రిని దలనరక మీ వీరబాహు నీ కుత్తర మిచ్చినాడు. ఇదిగో నాతని యానవాలు. దీని నింక దల నరకుము.

హరి: (స్వగతము) ఏమిది? నా కన్నుల కేమైన భ్రమ కల్గెనా? నిక్కువముగానే చంద్రమతిని జూచు చున్నానా? ఈ శిశుహంత్రి చంద్రమతియా?

(ప్రకాశముగా) అయ్యలారా! మీరు నేరస్థాపనయందుఁ బొరపాటు పడలేదు గద? తిన్నగ నాలోచింపుడు.

భటు: ఏమోయీ! మహారాజుగారి యాజ్ఞకే యెదురు చెప్పుచున్నావు? నీకీ యధిక ప్రసంగ మెందులకు? వెంటనే రాజాజ్ఞ నిర్వర్తించుము.మేఁమిక బోవుచున్నాము.(నిష్క్రమింతురు)

హరి: (చంద్రమతిని సమీపించి దుఃఖముతో)

శా.హా కాంతా! జగదేక పావనివి యీ యన్యాయపు న్నిందనీ
కా కల్పించుట? రాజు నిర్దయుడె యోగ్యాయోగ్యముల్చూడడే?
లోకంబంతయు నస్తమించెనె? దయా ళుండైన దేవుండు లే
డే కాపాడగ? గర్మసాక్షి పయిలేడే సర్వముం జూడడే?

చంద్ర: నాథా! దుఃఖింపకుడు. దైవము లేకేమి? పూర్వజన్మ సంచిత పాపఫలంబున నిజమో యబద్ధమో కాశీపురాధీశ్వరునిచే శాశ్వతమైన యీలాటి నింద యారోపింపబడి స్వచ్ఛమైన నీ కులంబున కెల్ల నొక కళంకంబు దెచ్చిన పాపాత్మురాలనైతి.

హరి: ఏమీ! జగదేకపావని వగు నీ యందే యొక నీచుడు నిందారోపణ మొనరించెనా? ఎట్లు?

చంద్ర: నాథా! అవధరింపుము. అట్లు మీచే సెలవందికొని పోవుచుండగా నొక బాలశవము నా కాలికి దగిలెను. అంత మతి చలించిన దానినై యా కళేబరము మన లోహితునదేమో నని పరీక్షించుచుండ యమకింకరులంబోలిన రాజభటుల చ్చోటికి వచ్చి

"ఓసి పాపాత్మురాలా! రాచబిడ్డనేల చంపితి" వని నగలమూట నొకదానిని నాయొడిం బడవైచి దొంగచిక్కెనని నన్ను దన్నుచు రాజసాన్నిధ్యంబునకుం గొంపోవ నతం డతికుపిత మనస్కుండై నా తల నరుకుమని యాజ్ఞాపించె, ఇదియే నా నిందకు గారణము.

హరి: అకటకటా! ధర్మమున నేఁటికెంతటి దుస్థితి సంభవించినది. తన చిత్తంబు మెప్పింప వలయునని సేవకు లెవ్వరి పైననో నేరమారోపించి తన యెదుట నిల్పినతోడనే న్యాయా న్యాయములు విచారింపకుండ నిరపరాధులఁ గూడ సాపరాధుల జేసి, శిక్షించుచుండిన

యీలాటి రాజులుండిన నేమి? మండిన నేమి?

దేవీ, చంద్రమతీ! నేటితో మన యాశాబంధము గూడ దీరిపోయినది. నేనింక నా స్వామి యాజ్ఞ నెరవేర్పక తప్పదు గదా! ఇదిగో, ఖండితులైన యపరాధుల రక్త పంకముచే నెర్రనై యున్న యీ వధ్యశిల నీ వింక నారోహింపుము. కులకాంతను నిన్నొక్కనికి విక్రయించిన యీ కృతఘ్నునకు స్త్రీ హత్యా పాతకము గూడ రాదగ్గదే!

చంద్ర: (వధ్యశిల నారోహించి) నాథా! మీరింక నాకై చింతింపకుడు. మీ రెరుగని ధర్మము లేదు గదా! నన్ను జంపుట వలన సంభవింపగల పాపము నిరపరాధుల శిక్షించు నీ కాశికా పురా ధీశ్వరు జెందుగాని మిమ్మంట నేరదు. అదిగాక, రాచబిడ్డను జంపితినను నీచమైన నిందను మోసిన నేనింక బ్రతికి మాత్రమేమి ప్రయోజనము. ఎక్కడనో నీచపు జావు చావకుండగా జీవితేశ్వ రులగు మీ చేతనే చావ గలిగినందులకు నేను బూజ్యురాలనే. మీరింక నిష్కళంక చిత్తమున మీ సత్యనిరూఢి వేల్పులెల్లం బ్రశంసింప నా తలద్రుంచి మీ స్వామి యాజ్ఞ నెర వేర్పుడు. ప్రాణపతీ! నా కడసారి వందనమందుకొనుడు.

హరి: హా! హా!దుర్భరము దేవీ! నీవెంత చెప్పినను నాకూరట జనించుటెట్లు?

సీ.నీవేకదా నాకు నిఖిలేప్సితంబుల
నవగతంబు లొనర్చు కల్పలతవు
నీవుగదా నాకు నిత్యసత్యయశంబు
దరిచేర్చుచుండెడు ధైర్యలక్ష్మి
నీవెకదా ఘోర దావానలమునుండి
మమ్ము రక్షించిన మానవతివి
నీవె గదా మౌని ఋణబాధఁ దొలగించి
పరువు నిల్పిన యట్టి భవ్యమతివి

గీ.నీవెకా నానిధానంబ నీవెకావె
నాకులవిభీషణంబవు నీవెకావె
అమరునే నాకు వేయి జన్మములకైన
నిన్ను వంటి సతీమణి నెలఁతమిన్న?

చంద్ర: నాథా! దుఃఖం బుపశమింపుడు.

హరి: ఇదిగో! నేను దుఃఖము విడిచిపెట్టినాడను.

గీ.మానినీమణి! గతమెల్ల మరచిపొమ్ము
పదిలపరుపు మేకాగ్రత హృదయవృత్తి
భక్తికడసారి నా భగవంతుని గూర్చిం
నేత్ర యుగ్మంబు మోడ్చి ధ్యానించుకొమ్ము

చంద్ర: పరమేశ్వరా! దీనబంధూ! దయాగుణసాగరా! విశ్వనాథా!

మ.ఇదియే నాకడసారి ప్రార్థనంబు తండ్రీ సర్వభూతేశ నే
నెద వే మోక్షపథంబుఁ గోరనిఁక నెన్నే జన్మముల్ నాకు నీ

వొదవుం జేయుదు వన్ని జన్మముల కెట్లో నిత్యసత్యవ్రతున్
సదసత్కార్యవిచారధీరుని హరిశ్చంద్రం బతిం జేయుమీ!

ప్రాణేశ్వరా! నే నీ జన్మమున నీ కొనరించు కడపటి నమస్కార మిదియే. ఇంక రాజాజ్ఞ నిర్వర్తింపుడు.

హరి: ఆహా! నా నాటకంబునకు నిర్వహణసంధి నా భార్య వధ విధానంబుతో ముగియుచున్నది గదా! అయ్యో! నేనెంత ఘోర పాతకుండను! పాలవంటి కులంబెల్ల నా కులంబొనరించి యొక్క చండాలుని దాస్యం బంగీకరించినది చాలక శరణాగతులగు వారిపైనను స్త్రీజనంబుపైనను గృపాణమెత్తక రక్షింతునను నా ప్రతిన గూడ భంగము గావింప, జేపట్టిన కులకాంతను నిరుపమాన పవిత్రతాలలామను చేతులార దలగోయ సాహసించుచున్నాను. అయ్యో! స్వామియగు వీరబాహుడు నన్నే యీ కార్యమునకేల నియమింపవలయును? తానే రాజాజ్ఞ నిర్వర్తించిన నాకింత సంతాపము లేకుండుగదా!

దైవమా! ఇన్ని దుఃఖములతో నన్నింత కాలము బ్రతుకనిచ్చిన దిట్టి స్త్రీ హత్యాపాతక మొడి గట్టుటకా? కటకటా! భూదేవీ! స్త్రీ హత్యకు గూడ బాల్పడిన యీ చండాలుని ప్రాణంబుల బోకార్చి నీ భారము కొంత తగ్గించుకొనరాదా? భగవంతుడా, లోకబాంధవా!

నీ వంశమెల్ల నిట్లపకీర్తి పాలుచేయుచున్న యీ నీచ హరిశ్చంద్రుని నీ సహస్రకిరణంబులచేత భస్మీభూతునిగా జేయలేవా? మునిజన గరిష్ఠా, వశిష్ఠా! ఈ నీ శిష్యుని పాపకర్మంబుల గన్నార జూచుచుండియు బ్రళయకాల నిర్ఘాతసమమైన నీ శాపవాక్కును విడువకున్నావేమి? ఛీ! ఛీ! దక్షిణహస్తమా! నీవు దినక్రమమున సుకృతములన్నియు మంటగల్పించుకొని తుదకేమి కానున్నావు?

ఉ.కమ్మని యాలనేత మునుగన్ సవనాగ్నిని దృప్తిసేయు పు
ణ్యమ్ము సగమ్మణంగె మననమ్మున బీనుగు లంటుటన్ వివా
హమ్మున నేసతిన్ విడువనంచు స్పృశించితో తచ్ఛిరమ్ము నా

కొమ్మను జంప నా సగము గూడ నశింపదే పాప హస్తమా!
ఖడ్గమా! నీ వెంత యపకృతికి బాల్పడుచుంటివి?

చ.విడిచితి రాజ్యమైన సరవిం గులకాంతనునైనం గన్న యీ
కొడుకును నైన! నిన్ను ననుజుంగతి జూచితి గాని ఖడ్గమా!
కడ కిటు వల్లకాటి కధికారము వచ్చిన యప్పుడైన నిన్
విడువనె యీ కృతజ్ఞతయు వీడి వధింతువె నా సతీమణిన్.

ఛీ! ఏమి నా మతి చాంచల్యము? పవిత్రమైన సత్యవ్రత రక్షణార్థము నే నిప్పుడెంత సాహసమైన నాచరింపవలసినదే కావున,

సీ.హృదయమా! సతికి నా రుణమెల్ల సరిపోయె
నీ కేటియాశ యీ నెలత పైన
మోహమా! నీ కాలము గతించె మా చెంత
బ్రతుకు మెందేని దంపతుల పొంత
దుఃఖమా! నీ వున్న దొసగు తప్పదు మాకు
దొలగ పొమ్మింక నా తలపు వీడి
ఖడ్గమా! మానినీ కంఠరక్తము గూడ
జవి చూడ గలవు నిశ్చలత గొనుము

గీ.సత్యమునకయి యీ హరిశ్చంద్రు వంశ
మంతరించెడు గాక శ్రీ హరుని మీద
మనసు గురిచేసి, హా! చంద్రమతీ! త్వదీయ
కంఠ మర్పింపు నీ పతి ఖడ్గమునకు.

(అని కత్తి నెత్తగా హఠాత్తుగా విశ్వామిత్రుడు ప్రవేశించి నివారించి)
విశ్వా: భళి! భళిరే హరిశ్చంద్రా! చాలుచాలు! నీ సాహసకృత్యంబు. ఛీ! ఛీ! నీవెక్కడనో రాకాసికి జన్మింపవలసినవాడవు.నీ ముఖము జూచిన దురితము. విపక్షశిక్షాదక్షంబగు నీ కౌక్షేయము నేటి కీలాటి లతాతన్వుల జంపసిద్ధ పడెఁగా? ఆరు నెలలు సాముచేసి మూల నున్న ముసలమ్మ నోడించినట్లు నీ భుజబలం బీలాగు గుసుమ కోమలులం జంపుటకు నక్కరకు వచ్చెనుగా?
నీ కులగురుండగు వసిష్ఠుండు నీకు ధనుర్వేదము నేర్పినదిందులకేనా? జగద్వంద్యమగు సూర్యవంశమున బుట్టి మావంటి వారికెల్ల దలవంపులగు నట్లొక్క చండాలుని దాస్యంబునకుం జొచ్చుట చాలక స్త్రీ హత్యకు గూడ బాల్పడితివిగా? దుర్మార్గుడా! సమంచిత సాధ్వీమతల్లి యగు నీ యిల్లాలి జంపి నీవింకనే స్వర్గరాజ్యం బేలదలచితివి? ఇప్పటికైన నా మాటవిని సౌందర్యసీమలగు నా ముద్దుకూతులం బరిణయమాడుము. నీ దారపుత్రుల ప్రాణదానంబును, రాజ్య ప్రదానంబును ననుగ్రహించెద. వినుము, నావాక్కులమృతముతో సమానములు సుమీ.

హరి: (నవ్వి) గాధేయా! ఈ నీతులు నాకవసరము లేదు గాని మీరింక నిక్కడ తొలగిపొండు. నా పూనిక మాన్పనింక మీ తరము కాదు. పొండు. పొండు.

విశ్వా: కానీ. నీ వనుభవించెదవు. (స్వగతము) నేనిప్పుడేమి సేయుదును?
హరి: దేవీ! సిద్ధముగా నుండుము.
విశ్వా: (తత్తరముతో) హరిశ్చంద్రా! ఈ పాటికి శాంతింపుము. నీ గురువే జయించెను, నేనే యోడితిని.
హరి: అయ్యా! మీ మాటలు నా కర్థము కావు. గురువేమో, జయమేమో నేనెరుగను.పొండావలకు.

విశ్వా: (దిక్కులకుం బరిగెత్తుచు) నక్షత్రకా! నేనిప్పుడేమి సేయుదునురా? ఓ దేవేంద్రా, మీరైన హరిశ్చంద్రుని వారింపుడు. హరిశ్చంద్రా! శాంతింపుము.

శా.సత్యశ్రీనిధివైతి! నీగురు ప్రతిజ్ఞావాక్యము ల్సెల్లె! స్త్రీ
హత్యాదోషము గట్టుకోకు! మిపు డార్యాభర్త విశ్వేశుడే
ప్రత్యక్షంబగు నీదు దేశికునితో బాలింపుమా నన్ను బ్రా
ణత్యాగం బొనరింతు లేనియెడ నన్యాయంబుగా నీకునై.

(మరల దిక్కులకు బరుగెత్తి)

శా.నేరంబుల్ దిగమ్రింగి కాళ్ళ బడినన్ వేధింతువేమి వసి
ష్ఠా! రా యిప్పుడు పెండ్లి వారి నడక ల్సాగింపకయ్యా! మహేం
ద్రా! రాజిప్పటికే తెగించి తన కార్యం బెల్ల నెగ్గించె నే
మో? రారండిక జచ్చు దాక బిగియుంపుల్గూడ వెవ్వారికిన్.

ఓ కాశీ విశ్వనాథా! నీవైన నీ రాజేంద్రుని వారింపుము.

(పార్వతీ సహితుడై పరమేశ్వరు డింద్ర వసిష్ఠులతో బ్రవేశించును)

హరి: (ప్రాంజలియై)

మానినీ వృత్తము

జయ జయ సురగంగా సంగతస్తోత్తమాంగా!
జయ జయ శరధినిషంగా శైలజాతాభిషాంగా!
జయ జయ వృషభతురంగా! సాధుచిత్తాబ్జభృంగా!
జయ జయ ధవళాంగా! సంతతానందసంగా!

మహాత్మా గిరీశా! నమస్కారము మహేంద్రా! వందనము గురూత్తమా! అభివాదము.

వశి: వత్సా! హరిశ్చంద్రా, నీయెడ పరమేశ్వరుడు ప్రసన్నుడయ్యె నీ కిక గష్టములు తొలగినవి.

పార్వ: చంద్రమతీ! పతివ్రతాతిలకంబగు నీచే లోకమంతయు బవిత్రమైనది. నీ కేమి వరములు కావలయునో కోరుకొనుము.

చంద్ర: అమ్మా! మీరు ప్రసన్నత జెందిన నీయరాని దేమున్నది? చనిపోయిన రాచబిడ్డను బ్రతికించి నాయపవాదము బాపుము.

పార్వ: సాధ్వీమణీ! నీ ధర్మమునకు మెచ్చితి, రాచబిడ్డతోగూడ నీకుమారుదు సజీవుండగు గాక! లోహితాస్యా లేచిరమ్మా! (లేవనెత్తును)

(తల్లి దండ్రులు కౌగిలించుకొందురు)

లోహి: మిత్రులారా! నే గోసిన కుశలెక్కడ?

పర: కుర్రా! నీ గురువులకు జేరినవి, తొందరపడకుము. హరిశ్చంద్రా! నీవిక రాజధాని బోయి పట్టభద్రుండవగుము.

హరి: అయ్యా! చండాలదాసుడనైన నాకింక రాజ్యమెందులకు? మీ దర్శన భాగ్యము లభించె జాలదా?

విశ్వా: హరిశ్చంద్రా! సత్యవ్రతము పరీక్షింప నేనే నీకిన్ని కష్టములు దెచ్చిపెట్టితిని. ఇది యంతయు నా మాయా కల్పితము. చూడు.

గీ.కడకు నిను దాసునిగ గొన్న కాటిరేడు
పరయముడు గాని కడజాతి వాడు గాడు
ఇప్పుడు నీవు వసించెడు నిప్పొలంబు
సపనవాటంబు గాని మసనము కాదు.

మరియు

క.పనికత్తెగ నీ వనితం
గొనినాతడు బాలచంద్ర కోటీరుడు గా
క నిజముగా విప్రుడుగా
దనఘా! హర సేవ దొరకునా యన్యులకున్?

కావున మరల నీ రాజ్యము నీవు గ్రహించి నన్నుం జరితార్థుని జేయుము.

వసి: వత్సా! ఈ విశ్వామిత్రుని ప్రార్థన మంగీకరించుము.

హరి: గురూత్తమా! ఇమ్మహనీయుడు ప్రార్థింపవలయునా!

పర: విశ్వామిత్రా! నీ చేతిలో గిరీట మాతని శిరం బలంకరింపుము.

దేవేం: గాధేయా! నాడు సకల మునిగణంబుల సమక్షమున జేసిన ప్రతిజ్ఞ చెల్లించుట కిదియే యదను. కావున నీ పరమేశ్వరాజ్ఞ శిరసావహించి నిత్య సత్యవ్రతుండగు నీ హరిశ్చంద్ర చక్రవర్తిని జేతులార బట్టాభిషేక్తుం జేసి నీ తపశ్శక్తి యంతయు ధారబోయుము.

విశ్వా: (అట్లుజేసి) ఇదిగో నా తపశ్శక్తి యంతయు ధారబోయుచున్నాను. పరిగ్రహింపుము.

వసి: విశ్వామిత్రా! ఇప్పటికైనా నెవరు గెల్చిరో చెప్పుము.

విశ్వా: చాలు, చాలు. విశ్వామిత్రుడు నీకోడెనని తలంచుచున్నావు కాబోలు! సాటి రాచ బిడ్డయగు మా హరిశ్చంద్రుని సత్యయశముం బ్రకటింప నుద్దేశించి సఫలీకృత మనోరధుండనగు మాకు బరాజయ మెక్కడిది? ఇన్ని కష్టముల పడకున్న నితని కీర్తి లోకమున కెట్లు వెల్లడి యగును?

హరి:

నిజము. ఇమ్మహనీయుని వచనంబులు యధార్థములు. చూడుడు

గీ.కరగినను గాని పసిడికి గాంతి రాదు
తరచినను గాని పాల జేకురదు వెన్న
యొరసినను గాని మణికైన నొరపు రాదు
ఇడుములనుగాని నరున కేర్పడదు కీర్తి.

దేవేం: విశ్వామిత్రా! నాడు నేను సభలో

గీ.సరసులగు పండితుల విమర్శనము లెల్లం

గడచినదె కద నిర్దుష్ట కావ్యమగును
తన కళత్ర సుత ప్రాణ ధనములుడుగ
సమయమున నిల్చి యున్నదే సత్యనిష్ఠ.

పర: హరిశ్చంద్రా! నీ కింకేమి కావలయును?

హరి: దేవా! నేనింక గోరందగిన దేమున్నది?

మ.తనయుండాత్తనయుండు దుర్విష లసద్దర్వీకరగ్రస్తుడై
మనియెన్! జెట్టున కొక్క పక్షిగతి సంసారంబు నిర్భిన్నమై
చనినన్ జేరితి నాలు బిడ్డల! నికృష్టంబైన దాస్యంబు వా
సె ననిర్వాచ్యఫలంబు దక్కె? నశియించెన్ దుష్టనిందావళుల్.

అయినను దేవర ప్రసన్నత జెందితిరి కాన నిట్లగుగాక.

మంగళమహాశ్రీ వృత్తము.

శ్రీ లొసగ ధారుణ సశేషమగు పంటలు విశేషముగ బండెడి ధరిత్రీ
పాలకులు రాష్ట్రముల బాడిమెయి నేలుదు రపార కరుణారససమృద్ధిన్
జాలగ వసుంధర నసత్యము నశియించుటను సత్యమె జయంబు వహించుచున్
ధీలలితులైన కవి ధీరుల యభీష్టముల దీర్చెదరుగాక నృపమౌళుల్.

పర: తథాస్తు.(అందరు నిష్క్రమింతురు)

గద్యము.ఇది హరితసగోత్ర పవిత్రనృసింహ మనీషి వరపుత్త్ర బుధజనవిధేయ లక్ష్మీకాంత నామధేయ ప్రణీతంబైన శ్రీ హరిశ్చంద్రీయ నాటకంబున సర్వంబును సంపూర్ణము.

వచన సాహిత్యముఉపన్యాసములునాటకోపన్యాసములు - ౧
శ్రీమాన్ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ
ఈ యుపన్యాసములు రెండును బళ్లారిలో ౧౯౩౪ అక్టోబరు ౨౦ - ౨౧\ తేదులలో,
మునిసిపలు హైస్కూలువారి యాజమాన్యమున జరిగిన
కృష్ణమాచార్య - శ్రీనివాసరాయల
స్మారకోత్సవ సందర్భమునఁ జేసినవి.

భారతి ౧౯౩౫ జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ (సంపుటి ౧౨ - సంచికలు ౧, ౨, ౩, ౪)

"కావ్యేషు నాటకం రమ్యమ్" అని మన పెద్దలు తలఁచిరి. అందుకు తగినట్లు సాహిత్యమునకు నాటకములు చదువుట పరమావధిగా భావించిరి. కాళిదాస కవీశ్వరుఁడు ఊరక చదువుటకంటె నాట్యము 'దేవతలు కన్నులతోఁ గుడిచి క్రోలవలసిన యజ్ఞ' మని పొగడెను. ఎన్నో విధములుగా రుచులు వేఱు వేఱుగాఁ గల జనుల నందఱిని తన ప్రక్క కీడ్చుకొని తృప్తిపరచు కళ యిదొక్కటే యని యతఁడు చాటెను. ఇంతటి మహత్త్వము తక్కిన యన్ని కళలకంటె దీని కెక్కడిది?

నాకుఁ జూడఁగా కారణ మిది; ఇదియొక కళగాదు. అన్నికళలును ఏకీభవించి చేసిన మూర్తి యిది. వాచికము, ఆంగికము నైన యభినయమే యీ విద్యలో కేంద్రస్థానము నాక్రమించినను తక్కినవన్నియు దానిపోషణకు పనికివచ్చును. ప్రతికళయందును కొంత విశిష్టమైన మేలిమి కలదు; అట్టి కొదవయుఁ గలదు. ప్రతికళయును కొన్ని భావములను జూపి మఱికొన్నింటిని మీరే యూహించుకొనుఁడని తనకు చేతఁ గాక మనకు వదలిపెట్టును. చిత్రకర్మలో వ్యక్తియొక్క పలువన్నెలు స్పష్టముగాఁ జూపవచ్చునుగాని దాని ప్రక్కలు, వీపును చూపలేము. జుట్టును జూచి మొగమో, మొగమును జూచి జుట్టో

ఊహింపవలసినదే కాని రెంటిని ఒకతూరి పటములో వ్రాసి ప్రదర్శింపలేము. విగ్రహ రచనలో వస్తువు దశ దిక్కులను చూపవచ్చును గాని వస్తు భేదమునకును, భావభేదమునకును ముఖ్యసాధనములలో నొకటి యగు వర్ణభేదమును జూపలేము. పై రెంటియందును క్రియారూపమగు చలనము చూపుట యసాధ్యము. వీనికంటె కవిత్వమందు వస్తువుయొక్క అంతరంగ బహిరంగములు, క్రియలు చిత్రింప వచ్చునుగాని దానికి మూలమైన పదార్థము శిల, మన్ను, వన్నె మొదలగువానినుండి ప్రత్యక్ష ద్రవ్యముగాక సంకేత రూపమైన భాష యగుటచే స్పష్టత యను గుణము పైవాని కన్న నిందులో తక్కువ. కాఁబట్టి తక్కిన కళలయం దక్కర లేనిది మాత్రమేకాక వికారముగాఁ గూడ పరిణమించు అతిశయోక్తి కవిత్వమునం దలంకారబీజమై వెలకెక్కినది. ఉన్నదున్నట్టుగా కొలతచేసి చెప్పినచో కవిత్వమునకు ప్రాయశః తేజస్సే యుండదు; వస్తువునూ మన హృదయములో ప్రతిబింబింపదు. అతఁడు గట్టివాఁడని, క్రూరుఁడని చెప్పినఁ జాలదు. రాక్షసుఁ డనవలెను. ఆ రెండు గుణములును అప్పుడే మనకు కొంత యర్థమగును. కవిత్వమందు పద్యములోనున్న భావసంగ్రహము, బలము, అచ్చుకట్టు గద్యములో నుండదు. గద్యమున నున్న విస్తరము, ధారాళత పద్యమందు సాధ్యము కాదు. మఱియు కవిత్వము గద్య రూపమైనను, పద్యరూపమైనను దాని మూలవస్తువు సంకేత రూపమగు భాష యగుటచేత, బయటి ప్రపంచమునఁ గాన వచ్చు పదార్థముల కన్నిటికిని సంకేతము లింకను ఏ భాషలోఁ గాని యేర్పడి యుండవు గావున, అంతరంగమగు భావము లందలి సూక్ష్మ సూక్ష్మతర భేదములకు సంకేతము గల్పించుట యసాధ్యము గనుక కవిత్వము చాలదూరము పోఁజాలదు, చాల లోఁతునకు దిగఁజాలదు. కాఁబట్టియే ఒక వస్తువును విస్తరముగా వర్ణింపవలసి వచ్చినప్పుడు మాటలు చాలక మనము కష్టపడుదుము. వేఱొక వస్తువును ఎరవు తెచ్చుకొని దానివలె నిది యున్నదని సాదృశ్యమును శరణు చొత్తుము. ఒక భావము తీవ్రముగా నున్నప్పుడు దానిని భాషారూపమున వెలువరింపలేక నోరు మూసికొందుము. తెఱచితిమా నత్తి తప్పదు. పై సూక్ష్మ సూక్ష్మతర భావములను సంగీతకళ ప్రదర్శింపఁ గలదు. కాని పై

యన్నిటికంటె స్పష్టత దీనిలో చాల తక్కువ. ఈ సంగతి కీభావ మర్థమని భాషయందున్నట్లు సంకేతమైనను దీనికి లేదు. అభినయ కళలో సచేతనముల, అందును మనుష్యుల భావములను, క్రియలను స్థూల సూక్ష్మ భేదములతో ప్రదర్శింప వచ్చును గాని అచేతన ప్రపంచమును, దాని భిన్న రూపములను వెలువరించుట యసాధ్యము; అస్పష్టము.

ఇట్లు ప్రతికళయు తనయందలి కొఱంత నెఱుఁగును గావుననే తన ప్రధాన ధర్మమైన అనుకరణమును చక్కగా నెరవేర్చుటకు ఇతరకళల సాహాయ్యము నపేక్షించును. చిత్రకర్మయు, విగ్రహ రచనమును ఒకటికొకటి తోడుపడును. కవిత్వమునకు సంగీతమును, అభినయమును తోడుపడఁ గలవు. సంగీతమునకు కవిత్వమును, అభినయము పుష్టినీయఁ గలవు. ఇట్లే అభినయము తక్కిన యన్ని కళల సాహాయ్యమును గోరును. ఒక సందర్భమును అభినయింప వలసిన వాఁడు దానికి వలయు వస్తువులను ఇల్లు, వాకిలి, అడవి మొదలగు వానిని కృత్రిమముగా తయారుచేసుకొని, వన్నెలు వేసి, వేసుకొని బహిరంగములను మన యెదుటఁ బెట్టును. అంతరంగమును వెలువఱచుటకు అభినయమునకు తోడు భాషను సహాయముగాఁ గొనును. దాని నింకను తీవ్రముగా ప్రదర్శింపవలయునేని పద్యమో, పాటయో యుపయోగించును. ఇట్లు సర్వకళాసమ్మేళనము గావుననే నాట్యము 'భిన్నరుచేర్జనస్య బహుధాఽప్యేకం సమారాధనం' 1 అను బహుమతిని బడసినది. ఏకళయందైనను కొంచెమో గొప్పయో పరిచయమును, అభిరుచియుఁ గలిగినఁ జాలును. దాని మూలమున మరల నానందపఱచుటకు నాటకమునం దవకాశమున్నది. అన్నికళల పరిచయము గలవారి మాట చెప్పఁ బనిలేదు.

ఒక వస్తువునందలి భిన్న భాగముల వేర్పాటు, శాస్త్రము; భిన్నపదార్థముల నొకచోటఁ జేర్చి చేయు కూర్పు, కళ. ప్రాచీనులీ తత్త్వమును చక్కగా గమనించిరి. కావుననే ఇంకను

లోఁతుగా దిగి అట్టి భిన్నకళల కూర్పుచే ఇంకను పరిపూర్ణమైన కళను సృజింపఁ బ్రయత్నించిరి. అదే నాటకము. మనవా రింతకంటెను సాహసమైన పని యొకటి చేసిరి. పై యభినయముజతకు కవిత్వము, సంగీతము మొదలగువానివలె తాళ లయ ప్రధానమగు నృత్త మను దానినిగూడ చేర్చుకొనిరి. పాత్రము అభినయించునపుడు పాటకు తోడుగ 'తోంతతఝణ' లతో ఆడును. ప్రాచీనతరమగు నాటక పద్ధతుల పరిశేష మనఁదగిన దొంబిదాసర్ల ఆటలలో ఇది యింకను నిలిచి యుండుట మన మెఱుఁగుదుము. రసభావములు ప్రధానముగా చూపవలసినచోట ఈ యెగుర్లాటలు అస్వాభావికములని యందఱును సందేహించుట సహజము. కాని సందేహము కలిగిన వెంటనే దేనినిగాని తటాలున వదలుట ప్రాచీన పద్ధతి కాదు. అది ఇప్పటి మన సంప్రదాయము. నృత్తము అస్వాభావికమైనను అభినయమునకు మెఱుగు నిచ్చు ననుట ఆ కాలము వారి కనుభవగమ్యమై యుండెను. ఋజువు చేయలేకపోయిన మాత్రమున అనుభవసిద్ధమైన దానిని తిరస్కరించుట అన్యాయము. కావుననే "లాస్య తాణ్డవ భేదేన నాటకాద్యుపకారకమ్" అను దశరూపక సూత్రమునకు వ్యాఖ్యానము చేయుచు ధనికుఁడు "నృత్తస్య శోభా హేతుత్వేన చ నాటకాదా వుపయోగః" అని మాత్రము వచించి యూరకొనెను. అస్వాభావికమగు పదార్థము శోభాహేతు వెట్లగును? దమయంతీ ద్వితీయ స్వయంవర వార్త విన్న నల చక్రవర్తి కుళ్లి కుములవలయునా, నవ్వి నాట్యము త్రొక్కవలయునా? అట్టి నృత్య మట్టిచోట్లఁ జూచి సంతసించువారికి పదార్థముల యానురూప్యజ్ఞానము కలదని చెప్పవచ్చునా? 'అరగజ'మును అన్నముతో కలిపి భుజించుచు నాలుక చేదైనను "ఆహా! ఎంత ఘుమ్మనుచున్నది!" అని మెచ్చుకొనువారిది రుచియా, పిచ్చియా? నాటకము జనుల జీవిత మందలి యవస్థల యనుకరణమే తప్ప వెఱ్ఱి వెంగళయ్య చేష్ట కాదుకదా! - ఇట్లు ప్రశ్నించుట అనుభవ రసికుల దృష్టి కాదు; వివేక ప్రధానులగు విమర్శకుల దృష్టి, మొదటిది హృదయమును నమ్మినది, రెండవది మెదడు నాశ్రయించినది.

ఈ వివేక దృష్టి బలిసిపోవుచుండుటచేతనే మనలో నాట్యమునకు సహాయము చేయుచుండిన కళలు ఒక్కొక్కటిగా ఊడి పడిపోవుచున్నవి. నృత్తము నాటకమును వదలిపోయి ఎన్నోనాళ్లాయెను. మీ వివేక మెక్కడ కొల్లఁ బోయిన మాకేమి యని పామరజనులు మాత్రము దాని నింకను వదలక పట్టుకొని యున్నారు. ఈవల వారును చాలవఱకు దానిని వదలిపెట్ట నుపక్రమించినారు. అది మన సహవాస దోషము కొంత, వారి కన్నిటియందువలె దానియందును కాలవశమునఁ గలిగిన యనుత్సాహము కొంత. ఎప్పుడు తాళలయాశ్రయమగు నృత్తము చేవిడిచిపోయెనో అప్పుడు దానివెంటనే దానివంటివగు పాటలును మఱుఁగుపడెను. సంస్కృత నాటకములలో ఎందును పాట లున్న సూచనయే కానరాదు. రత్నావళి మొదలగు వానిలో 'ద్విపదీ ఖండము', 'చర్చరి' మొదలగు గీతఖండము లొకటి రెండున్నను అవి నృత్త గాన సన్నివేశమువలన వచ్చినవిగాని పాత్రముల యభినయమునకు సహజముగా తోడుపడినవి గావు. తుదకు త్రిశ్రగతిలోనో, చతురస్రగతిలోనో తాళమార్గము ననుసరించి విధింపఁబడిన నాందినిగూడ సంస్కృత నాటకకర్త లొక వృత్తముగా మార్చుకొనిరి. ఇటీవల మనము ఇంకను ఈ వివేకదృష్టిని తెగఁ బెంచుకొనుచున్నాము. ప్రాచీను లెట్లో చంపక నిలుపుకొన్న పద్యములను గూడ ఇప్పుడు అస్వాభావికము లని నాటకములనుండి తీసివేయు ప్రయత్నములు చేయుచున్నాము. ఇఁక పాటల మాట చెప్పఁ బనిలేదు. శ్రీధర్మవరము కృష్ణమాచార్యులును, కోలాచలము శ్రీనివాసరాయలును తమ నాటకములలో పాటలు కుప్పలుగా నించియున్నను వానిని పామరజనప్రీతికే చేయవలసివచ్చె నని 'పండితుల' క్షమాపణ కోరుకొన్నారు. పై స్వభావవాదమునే ఇంకనుఁ సాఁగఁదీసి తుదకు స్త్రీ పాత్రములను స్త్రీలే వహింపవలయునని చెప్పవలసిన స్థితికి దిగినది మన కళాభిరుచి!

ఈ స్వభావవాదమునకు తోడుగా కళాస్వాతంత్ర్యవాద మొకటి కలదు. దీని ప్రకారము ప్రతికళయును స్వతంత్రముగా వర్తింపవలయును గాని యితర కళలకు పరాధీనమైన

బ్రతుకు బ్రతుకరాదు. అప్పుడే దాని పరిశుద్ధియు, పరిపూర్ణశక్తియు బైలుపడును. అట్లుగాక మిశ్రణము చేసితిమేని యేకళయును స్వశక్తిని సంపూర్ణముగాఁ జూపలేకపోవును. నాటకముల విషయమున ఈ వాదము నాశ్రయించు వారిలో వేఱువేఱు అంతస్తులు గలవు. పాటలు వలదనువారు కొందఱు; పద్యములు తిరస్కరించువారు మఱికొందఱు; ఇంక కొందఱు పద్యములున్నను వానిని రాగముతో పాడక గద్యమువలె చెప్పవలె ననువారు; వేఱుకొందఱు వేషములు, వన్నెలు, తెరలును అక్కర లేదనువారు; అసలు మాటలే కూడదనువారును లేకపోలేదు. మూగ నాటకములగు 'కథకలి' మొదలగునవి యీ వాదపు పరిణామములే. ఇది కేవలము ఆధునిక దృష్టికాదు. ప్రాచీనులలోను ఇట్టి యభిప్రాయములు కలవనుట కాధారము లున్నవి. కాని పాశ్చాత్య సంస్కారముచే నిప్పు డిది బలమగుచున్నది.

ఈ స్వాతంత్ర్య వాదమును గూర్చి మన మెక్కువ తంటాపడవలసిన పనిలేదు. ఎందుకనగా: పరస్పర సహాయమే సృష్టిలోని మూలతత్త్వము. కూర్పు కళాధర్మము. అట్లుండగా ఈ వాదము గట్టిగా నిలుచుట యెట్లు? కత్తి మీఁది సామువలె, ఏకాక్షర కవిత్వమువలె, స్వతంత్రకళలో భావప్రదర్శనము చేయుటకు తనుకులాడు కళావంతుని సామర్థ్యము మనము మెచ్చుకొనవచ్చును గాని మనకు దానిచేత పూర్ణతృప్తి కలుగుననుట నిజముగాదు. పలువన్నెల చిత్రమునకున్న విలువ ఒంటివన్నె చిత్రమున కుండరు. అర్థముగల కీర్తనలకున్న గౌరవము తిల్లానాల కుండదు. పది పాత్రములను పదుగు రభినయించుటకు బదులుగా ఒక్కడే యభినయించెనేని వానిది గొప్పశక్తియే కాని మనకు రక్తి తక్కువ. కావున ఈ వాదమునకు బలము చాలదు. సాధ్యమైనంత వఱకు ప్రతికళయు స్వతంత్రముగా నుండవలయు నందురేని యెవరును కాదనరు. కాని ప్రతికళకును అసాధ్యములైన ప్రమేయములు కొన్ని కలవనియు, వాని నట్లే వదలుటకంటె ఇతర కళల తోడ్పాటుతో సాధించుట ధర్మమనియు అంగీకరింపక తప్పదు.

ఇప్పుడు ముఖ్యముగా నాటకప్రపంచమును తలక్రిందు చేయుచున్నట్టిది స్వభావవాదము. ఇది అందఱికిని అర్థమగును. న్యాయమని యెక్కువ కష్టము లేకయే తోఁచును. ప్రపంచమున జరుగుచున్నవి, జరుగవచ్చునట్టివి యైన అవస్థల ననుసరించుటయే కదా నాట్యకళ! కాఁబట్టి రంగస్థలమున వ్యక్తులు చేయు పనులు, ఆడుమాటలు, వేయు వేషములు - అన్నియు సహజముగా నుండవలయును. కావుననే మన నిత్యవ్యవహారములో లేని ఛందస్సు, సంగీతము మొదలగునవి రంగము మీఁదికి వచ్చుట కధికారము లేదు. మగవా రెంతకష్టపడినను వారి స్వరూపము, స్వరము, నడక మొదలగునవన్నియు భిన్నములు గావున స్త్రీపాత్రమును సహజముగా ప్రదర్శింప లేరు. కావున స్త్రీపాత్రములు స్త్రీలే ధరింపవలెను. కృత్రిమములైన యవయవములతో ఆఁడపాత్రను అవకతవకగా అభినయించువానిని జూచి కథానాయకుఁడు 'ప్రియురాలా!' యని కౌఁగిలింపఁబోవుట యెట్లు? పై రెండును నా దృష్టిలో స్వభావవాదము యొక్క యిప్పటి ప్రబల పరిణామములు. చిల్లర మఱికొన్ని కలవుగాని ప్రకృతము వానిని విస్తరింపక యీ రెంటిని గూర్చి మాత్రము కొంత చర్చింతును.

ఈ స్వభావవాద మింత ప్రబలముగా నున్నను మనము కొంత విమర్శించి చూచితిమేని నిలువక సడలిపోవును. ప్రకృతియందలి పదార్థముల భావములను, క్రియలను అనుకరించుటయే నాట్యమని ప్రాచీనులు అంగీకరించిరి. 'అవస్థానుకృతి ర్నాట్యమ్' అనియే వారును నిర్వచించిరి. నాట్య మొక్కటేకాదు, కళాసామాన్యపు మూలవస్తువునూ అనుకరణమే. ఉండునది ఉండవచ్చునట్టిది, ఉండవలయునట్టిదియు నగు వస్తువును బ్రదర్శించుటతోడనే కళలన్నియు మొదలు పెట్టును. కాని సంపూర్ణముగా ఏవస్తువునైనను అనుకరించుట యసాధ్యము. ఒక మల్లెపూవును కాగితము, వస్త్రము మొదలగువానిని కత్తిరించి చేయవచ్చును; లోహములతో పోఁత పోయవచ్చును; మ్రాను, దంతము మొదలగువానిని చెక్కి చేయవచ్చును; పటముపై వన్నెతో వ్రాయవచ్చును; వ్రేళ్లు మలఁచి చూపవచ్చును; దానిపై పద్యమువ్రాసి వర్ణింప వచ్చును, కాని యిన్నిటిలో

దేనియందుఁగాని, తుద కన్నియు కలిపి చూచినగాని నిజమైన మల్లెపూవునందలి వన్నె, స్పర్శము, కొలఁత, సుగంధము, రూపము మొదలగు సర్వాంగములును మన మనుకరించినట్లగునా? రంగస్థలము మీఁద ఒకఁ డొకనిని పొడిచి చంపు సన్నివేశము వచ్చినప్పుడు నిజముగా పొడిచి చంపిననేతప్ప వాఁడు చంపినట్లగునా, వీఁడు చచ్చినట్లగునా? ఇట్లు అసాధ్యము, అనర్థదాయకమును అగుట యట్లుండగా సంపూర్ణానుకరణము కళపని కనావశ్యకము గూడ. ఎందుకనఁగా, కళాకార్యము వస్తువుయొక్క విశిష్టస్వరూపమును - ఇది ఫలానిదని గుర్తించుటకుఁ గావలసిన ముఖ్యధర్మమును - మన భావనావీథిలో ప్రతిబింబింపఁ జేయుటయే తప్ప దాని యంగోపాంగముల జ్ఞానమును మన మెదడున కంటించుట కాదు. అనఁగా అంగవర్ణన అక్కర లేదని కాదు. అంగసామాన్యముల వర్ణన మక్కరలేదనుట. కాని అంగవిశేషవర్ణన మత్యావశ్యకమే. ఎందుకనఁగా అంగి యందలి విశేషధర్మమును అంగముల విశేషధర్మము తెలుపును; పుష్టిచేయును. చిత్రించిన జంతువు గాడిద కాదు, గుఱ్ఱమే యనిపించవలసినప్పుడు పొడుగైన, కుచ్చైన తోఁక చూపవలసిన విశేషాంగములలో నొకటి. కాని ఆ తోఁక లోని వెంట్రుకలన్నియు లెక్కపెట్టి చూపవలసిన పనిలేదు. మఱియు అనుకరణము కొన్ని సందర్భములందు మూలవస్తువునకు విరుద్ధమైన గుణము గలదియుఁ గావచ్చును. మల్లెపూవు తెల్లనిది. కాని దానిని నల్లరాతితో చెక్కవచ్చును. హిమాలయమువంటి సర్వోన్నత పర్వతమును అంగుళము చోటులో ఇమిడించి చిత్రింపవచ్చును. శ్రవణబెళగొళములోని గోమతేశ్వరుని విగ్రహము అరువది యడుగుల యెత్తున్నను మనుష్య విగ్రహమే, సిద్ధముగా తీర్చిన, యేరిన స్వరముల యల్లికను వ్యవహారములో ఎవరును ఉపయోగింపరు. కాని సంగీతము విన్నప్పుడు మనకు శోకము, సంతోషము మొదలగు ప్రకృతి సిద్ధములగు భావములు తలచూపును. ఇంతేకాదు, వస్తువు యొక్క అంతరంగ తత్త్వమును చక్కగా భావన సేయఁగల శిల్పి కలిగెనేని, మనము సామాన్యముగా అవశ్యకములని, ముఖ్యములని తలఁచు బైటి యంగములుగూడ నిరర్థకము లనిపించును. మైసూరు సంస్కృత పాఠశాలలో కొన్ని

యేండ్లక్రింద వేణీ సంహార నాటక మభినయించుట నేను చూచితిని. చుట్టును సభ్యులు కూర్చుండి యుండగా నడుమ నాలుగు బెంచీలు వేసి రంగస్థల మేర్పఱచి యుండిరి. నియత కాలమునకు సరిగా నలుగురు విద్యార్థులు వచ్చి రంగస్థలమున కుర్చీలపైఁ గూర్చుండిరి. వారిలో దోవతి, షర్టు, ఉత్తరీయము, క్రొత్తగా చేసికొన్న అర్ధభద్రాకరణముచే తళతళలాడు తల, విభూతికట్ల ఫాలమును గల్గి సామాన్య శరీరము గల యొక విద్యార్థి తనవలెనే ప్రక్కన కూర్చున్న మఱియొక విద్యార్థిని చూచి 'ప్రియే!' యని సంబోధించెను. వాఁడును 'ఆర్యపుత్ర!' యని ప్రత్యుత్తర మిచ్చెను. రెండు మాటలాడులోపల మొదటివాఁడు భీముఁడనియు, రెండవవాఁడు ద్రౌపదియనియు మే మెఱిఁగి నవ్వఁజొచ్చితిమి. కాని మఱి రెండు నిముషములలో మా నవ్వంతయు మాయ మయ్యెను. బక్కపల్చని బడుగైనను భీముఁడు గావచ్చుననియు, చీరయే కట్టకున్నను స్త్రీపాత్రము నభినయింప వచ్చుననియు నా కర్థమైనది. భీమపాత్రము వహించిన వాఁడు ఇంక కొంత స్థూలకాయుఁడుగా నుండియుండెనేని ద్రౌపది నభినయించినవాఁ డొక చీర గట్టుకొనియుండెనేని, మనకు మొదట గలిగిన ఆ యింతనవ్వును రాక యుండును. బహిరంగముల ఫలమింతే. మన చిత్తవృత్తిని వస్తువిశేషమగు అంతరంగము వఱకు ఈడ్చుకొనిపోయి విడిచి తాము వెనుకఁ బడును. కళావంతుని ముఖ్యమగుపని ఆ చిత్తవృత్తిని ఆచోట ఏకాగ్రముగా నిలుపుటయే.

కాఁబట్టి కళకు అనుకరణము సాధనము, సాధ్యము చిత్తైకాగ్రత, దాని ఫలము శాంతి. కడచిన తృతీయాంధ్ర నాటక కళాపరిషత్తులో అధ్యక్షత వహించిన శ్రీ తాడిపర్తి రాఘవాచార్య నటశేఖరుఁడు "మనశ్శాంతిని బడయుటకు నాటకములు ముఖ్యసహాయకము లనుట నా కిప్పు డనుభవమునకు వచ్చినది" అని చెప్పినమాట చాల విలువగలది. నాటక మొకటే కాదు, అన్ని కళలును అంతే. శాంతి యనఁగా సోమరితనము కాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంతరముగా ఏదేని యొక వస్తువునందు చిత్తము నిల్పఁగలుగుట. బహువిధములచే భిన్నమగు ఈ ప్రపంచమునందు

అభేదానుభవమును సంపాదించుట. ఇట్టి అవస్థ ఆనందమయము. ఆనందమనఁగా సుఖము కాదు. సుఖము ఇంద్రియములకు సంబంధించినది. ఆనందము ఆధ్యాత్మికము. అనఁగా ఆత్మ కెక్కువ సంబంధించినది. మంచి కంచువంటి శారీరమును విన్నప్పుడు సుఖము చెవులకుఁ గలుగును. అందు వివిధ భావములను ప్రదర్శించి రాగాలాపన చేయునపుడు కలుగునది ఆత్మానందము. అట్లే నాటకములలో వింతవింత వన్నెల తెరలు, తళతళలాడు చీరలు, సొమ్ములు ఇత్యాది. 'పుస్తము' లను చూచినప్పుడు కన్నులకు సుఖము గలదు. శృంగారాది భావములను విరివిగా నటు లభినయించునప్పుడు ఆత్మకానందము గలుగును. సుఖము ఆనందముయొక్క మిత స్వరూపము. మఱియు చంచలము. సుఖమే దుఃఖమునూ అగును. చలికాలమున వేఁడివేఁడిగా ఒక గిన్నెఁడు కాఫీ త్రాగుటలో సుఖమున్నది. అదే రెండవ గిన్నెకు ఉదాసీనమై మూఁడవగిన్నెకు అసహ్యమగును; ఇంకను మించిపోయిన విష మగును. ఆనంద మట్టిది కాదు. సంపాదించుకొనఁగల కొలఁది అనుభవింపవచ్చును; అనుభవించుకొలఁది ఆశ లూరును; అమేయమగును. కాఁబట్టియే ఇట్టి యానందమునకు హేతువువగు శాంతికై పూర్వకాలపు మహర్షులు వేకారి చేసిన "ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః" అను ఘోషణ ఇప్పటికి వేదము వల్లించువారి నోట మిగిలియున్నది.

శాంతిని సాధించు వస్తువు లయము. సంగీతగాంధ్ర వ్యవహారములో లయమనుమాట విన్నాము. అక్కడ ఆ పేరునకు సంగీతమునం దాటపాటలకై యుపయోగించు కాలపు తునకల పరస్పర సామ్యము అర్థము. నడకకు మూలమగు కాలమాత్రలలో ఏమాత్రమును భేదము, ఎగుడుదిగుళ్లును ఉండక ఒకటేఖత్తుగా నికరముగా వర్తించుట. కాని యీ లయశబ్దమునకు కాలఖండసామ్య మనిమాత్ర మేకార్థమును సంకోచింపక "సామ్యము" అనియే సామాన్యమగు నర్థమిచ్చి చూచితిమేని మన జీవితమందు ఈపోలిక యెంత ప్రబలమైన పదార్థమో గమనింపఁ గలము. సామ్యము లేనిచోట వైషమ్యము. మనకు వైషమ్యమువలె మనస్సును కలఁతపెట్టి నొప్పి కలిగించు ధర్మము వేఱులేదు.

ఇంటిముందఱి కంబములు రెంటిలో ఒకటి యింకొక దానికంటె పొడవులోనో, లావులోనో ఎక్కువ తక్కువగా నుండినచో ఎంత మనసు కంటగించునో వేఱుగా చెప్పవలయునా? శరత్కాలమున చీఁకటి రాత్రులలో ఆకాశమును జూచిన యెవరికిఁగాని "ఇన్ని నక్షత్రములును ముత్యాలముగ్గు పెట్టినట్లు ఏదైన నొక లయప్రధానమగు ఏర్పాటులో నుండక, కల్లములో గాలికి చెదరిన జొన్నలవలె చెల్లాచెదురుగా ఏల విసరి చల్లిన ట్లున్నవి?" అను వెత కలుగకుండునా? సామ్య మున్న చోట చక్కఁదనమును, వైషమ్య మున్న చోట వికారమును మన మనుభవింతుము. ఇ ట్లేలయగును? ఇది స్వభావ మింతే. సృష్టి యందే మన మేవస్తువు యొక్క నిర్మాణమును పరీక్షించినను అందు ఈ సామ్యము విశేషముగాఁ గానవచ్చును. మన కాళ్లు, చేతులు, కన్నులు మొదలగువానిని పరస్పరము పోల్చి అవి యెట్లు సమముగా తీర్పఁ బడినవో చూడుఁడు, తుదకు ఒక చేతిలోని ఐదువ్రేళ్లునూ ఒక్కొక్కటి యొక్కొక్క తీరున విషమముగా నున్ననూ అదేరీతినే వ్రేళ్లను ఇంకొక చేతియందును అమర్చి సృష్టికర్త సామ్యము నిర్వహించి యుండుట మనము చూడఁగలము. ప్రకృతిలో వైషమ్యము లేదనికాదు, కలదు. మఱియు సామ్యమును, వైషమ్యమును "సమతూకము" గానే యున్నవేమో! కాని యెట్లయినను ఆ వైషమ్యమును తొలగించ వలెనను ఆసయు, సాధ్యము గాని చోట దానిని తొలఁగి దూరముగా నుండవలెనను ఆత్రమును మనుష్యులకు - ఏల, ప్రాణిసామాన్యమునకు - గలదు. ఒకటికన్న నెక్కువ పదార్థములు సమానముగాఁ గనఁబడి నప్పుడు వానియందలి భిన్నబుద్ధి చాలవఱకు నశించి మనసు నెమ్మదిపడును. ఇది లేనిచోట కృత్రిమముగానైనను కల్పించి యానందింతుము. చెట్టుకొమ్మలు లయశుద్ధిలేక యెగుడు దిగుడుగా, వంకరటింకరగా పెరిగినచో కత్తిరించియైనను చక్కఁజేసి కన్నులు తృప్తిపఱచుకొందుము. ఈ లయము పదార్థముల జాతి, గుణము, క్రియ మొదలగు నన్నిటియందును వ్యాపించి అనంతమై అమేయమైన బలముగల మూల ధర్మము. సౌందర్యము, సౌమనస్యము, అనురూప్యము, అభిమానము, స్నేహము - అను భావములకెల్ల ఇదే ఆధారము. దీని ననుభవించునపుడు మనము సృష్టి మూలతత్త్వమునే

స్పృశింతుమేమో! దీని మహత్త్వమును గమనించుట యందే మనుష్య ప్రయత్నము లన్నియుఁ బ్రవర్తించిన ట్లున్నది.

ఈ సహజమగు లయాభిమానమును వెలువరించు మానవ ప్రవృత్తులే కళలు. కావుననే వానికి అనుకరణము బీజమైనది. సృష్టిలో వైషమ్య మిశ్రమముగానున్న లయవేగము చాలక, ఉన్నది కొంత, ఉండవచ్చునది కొంత, ఉండవలసినది కొంత చూచి, ఊహించి, కల్పించి అనుకరించుట కళాధర్మము. అనుకరించుటకు మనము గ్రహించిన ప్రతివ్యక్తియందును రెండు భాగములు గలవు; వెలుపలి రూప క్రియాదులు, లోపలి తత్త్వము. వీనిలో బహిరంగముల ననుకరించుట అంత కష్టము గాదు, ప్రాయపువాఁడు ముసలి వాని వేషము వేయవలసినప్పుడు తెల్లగడ్డము, వంగి నడచుట, కాళ్ల చేతుల వణఁకు మొదలగువానితో ఆ పని చేయవచ్చును. కాని ముసలివారి అంతరంగములగు మఱపు, హృదయ దౌర్బల్యము, సుకుమారత, పక్వమైన వివేకము, ఇంకను ముదిరినచో అవివేకము - మొదలగువాని ననుకరించుటయే కష్టము. అప్పుడే మనకు ఆ ముసలివ్యక్తితోడి లయము పూర్ణముగా సిద్ధించును. కాఁబట్టియే కళలలో బహిరంగాభినయము చేయువానికంటె అంతరంగమందలి భావభేదములను విరివిగా ప్రదర్శించునవియే యెక్కువ మనల నాకర్షించును. ఱాతిలో పాత్రమును తొలుచువానికంటె ప్రతిమను తొలుచువానికి గౌరవమును, వెలయు నెక్కువ. కారణము మొదటిదానిలో అంతరంగచర్చ లేదు. రెండవ దానిలో అంతరంగదృష్టి తప్పనిది. కాకున్నచో దానిని మొద్దుబొమ్మ అందుము. తక్కిన కళలన్నియు అంతరంగ బహిరంగముల రెంటిని కొంతకుకొంత వెలువఱచునుగాని సంగీత మొక్కటి కేవలము అంతరంగమునే ఆశ్రయించినది. పాశ్చాత్య సంగీత పద్ధతిలో ఉఱుము, తుపాను, సముద్ర తరంగముల కోలాహలము - మొదలగువాని ననుకరించు బహిరంగ రచన కలదని విన్నాను గాని మనపద్ధతిలో అట్టి దేదియు లేదు. కాఁబట్టియే సూక్ష్మములైన, తీవ్రములైన ప్రాణిభావభేదములను గానము చూపఁగలిగినట్లు ఏ యితరకళయు

చూపలేదు. మఱియు ఏడ్పు, నవ్వు, ప్రేమ, ప్రార్థన మొదలగు భావములను విచిత్రరీతుల, వివిధగతుల వెలయింప వచ్చును గాని ఏడ్చువా రెవరో, స్త్రీయో, పురుషుఁడో, చిన్నయో, పెద్దయో, ఏజాతియో, వస్త్రము లున్నవో, దిగంబర మూర్తియో, ఎందు కేడ్చునో - ఏదియు చూప వీలులేదు. ఇందుచేతనే తక్కిన యన్ని కళలకంటె దీనియందు స్పష్టత తక్కువ యంటిని. ఇట్టివానిని స్పష్టపఱుపవలెనన్న కవిత్వమునూ, అభినయమునూ గానమునకు తోడు గావలయును. 2 ఇట్లే భావ ప్రదర్శనమందు అభినయమునకు కవిత్వమును దానికి సంగీతమును సహాయము గాకున్నచో పూర్ణభావ లయము మనకు సిద్ధింపదు. భరతుఁడు అయోధ్యానగరము నంతయు నిదానముగా నొక్కమాఱు కలయఁజూచి చేతులెత్తి వేలవేసి తల వంచుకొని కన్నులు మూసికొన్నాఁడనుకొందము. అతని ఆ భావము స్పష్టముగా మన మనస్సులలో రూపుగొనవలయునేని "అన్న లేక శ్మశానముగా నున్నదే ఈ పాడూరు. కన్నులతో ఎట్లు చూడఁగలను?" అని చెప్పక తీరదు. ఇట్లు గద్యముగాఁ జెప్పుటకన్న

"మా రాఘవుఁడు లేమి
మసనమై తోఁచు నీ
పాడూరు కన్నెత్తి
చూడఁగలనె?" 3

అని యిట్లు పద్యముగా లయమధ్యమందు బిగించినప్పుడు భావమునకు బిగు వెక్కువ. దీని తోడుగా శ్రుతి రాగలయలతో పాడినచో భావ మింకను కేంద్రీకృత మగును. దానికి తోడు తాళ లయ సహితమైన పాటయే యయ్యేనేని మేలు కాదా? మన ప్రాచీను లింకను లోఁతుకు దిగి నృత్తమును గూడ చేర్చిరని వెనుకనే విన్నవించితిని. ఏల కారాదు? భావములను తీవ్రపఱచు శక్తి శ్రుతి రాగ తాళ లయల నాశ్రయించిన సంగీతమున కున్నదఁట. అక్షరమాత్రాలయమును జూపు శక్తి పద్యరచన కున్నదఁట. నృత్తమునకు మాత్ర మేల లేదు? కావ్యములలో పద్యములు చదివినప్పుడు, కచ్చేరీలలో పాటలు

విన్నప్పుడు ఆ యా భావములు మనలో నుద్రేకించుట లేదా? అట్లే నృత్తమునకును శక్తి కలదు గాని మనము దానిని చక్కఁగా పరీక్షింప లే దంతే. మృదంగము మొదలయిన వాద్యములను పాటకచ్చేరీలలో వినునప్పుడు వాయించువాని జుట్టు ఎగుర్లాడుట చూచి నవ్వుచుందుము; ఆడుచున్న బోగముసాని అంగసౌష్ఠవములపై దృష్టి యుంతుము. అట్లుగాక కొంత ప్రయత్నించి ఆ లయపు నడక ననుసరించి పోవుచు దానిచే మన మనస్తత్త్వముపైఁ గలుగు పరిణామములను పరీక్షించు కొంటిమేని కాలమాత్రాలయ ప్రధానమగు ఆ కళకు ఎంత సత్తువ కలదో మనలో సహృదయు లందఱును గమనింపవచ్చును. రుచియైన భోజనము గమ గమలాడునట్లు ముందు తెచ్చిపెట్టినను ఆఁకలి లేనివానికి కాఁబట్టనట్లే తత్త్వము కొంత యెఱిఁగి హృదయమును సంస్కరించుకొని తయారుగా నుండనివానికి ఎటువంటి కళయైనను బూడిదలో హోమ మగును. కావున కళాస్వరూపమును విమర్శించునపుడు అది స్వాభావికమా, కాదా అను విషయమును కేవలము బహిరంగములచేత, బహిరింద్రియములచేత నిర్ణయింపక అంతరంగమును, హృదయమును నమ్మి పరీక్షించిన పక్షమున ఇప్పటి స్వభావవాద మెంత తేలిక యైనదియు మనకుఁ దెలియఁ గలదు.

కాని మనలో నృత్తము నశించినది. కాళిదాసాదుల కాలమునకే అది అంతరించినది. దానిని మరల పామరజనులను జూచి నేర్చుకొనియైన పునరుద్ధారము ఎప్పుడు చేయఁ గలమో, చేయనేలేమో తెలియదు. కావున నాటక విషయమున దానినిగూర్చి చర్చించుట ఇప్పటికి వట్టి సిద్ధాంతపు మాట; వ్యవహారపు మాట కాదు. కావున దాని నట్లుండ నిత్తము. మనలో ఇంకను చావక బ్రతికినవి పద్యములు, పాటలు. పాటలు గూడ మనలో నాటక ప్రపంచమునుండి విడివడి యుండెను. ఏ పార్సీకంపెనీ వారి పుణ్యాననో మరల వచ్చి అతుకుకొని అల్లాడుచున్నవి. వానినిగూడ త్రోసివేయు ప్రయత్నములు జరుగుచున్నవే యను కడుపు చిచ్చుతో మీ కింత గందరగోళము మనవి చేయవలసితిని. కాని నాటకములందు పాటలను, పద్యములను చక్కఁగా యథోచితముగా నిర్వహించు కష్ట మెఱుఁగక పోలేదు.

ఇందు మొదటి కష్టము నాటకము రచించు కర్తది. నాటకమందు ప్రధానమైనది అభినయకళ. అందు సాత్త్వికము, ఆంగికము, ఆహార్యము అను త్రివిధాభినయములను గూర్చి కవి కేమియు అధికారము లేదు. అతఁడు సప్లై చేయునది వాచికాభినయమునకు పనికివచ్చు భాష మాత్రమే. ఆ భాషను పద్యములుగా ఎప్పుడు రచింపవలయును, ఏ పద్యము లేచోట్ల వాడవలయును, దానిని పాటగా నెట్టి సన్నివేశమందు కూర్పవలయును, ఏ రాగములో, ఏ లయలో - ఇత్యాది విషయములను చక్కఁగా భావనచేసి రచించి పెట్టుట వాని పని. కాని ఆ వివేచనా శక్తి గలవారు నాటక కర్తలలో నూటి కొక్క రుందు రంతే. తక్కిన వారందఱును ఇచ్చ వచ్చినట్లు కలిపికొట్టి వ్రాయువారే. ఎవరో, యేచోటనో వ్రాసిరని సమయము దొరకినప్పుడెల్ల అమ్మ, అయ్య అని పాదములను ముగించుచు అసహ్యములైన సీసపద్యములు గుప్పించువారు కొందఱు; త్యాగరాజు కీర్తనలను అచ్చుగొట్టు వారు కొందఱు; పారసీమట్లకు ప్రతిపదములు వేయువారు కొందఱు; జావళ్లకును, జట్కాసాహేబుల వరసలకును అక్షరమును జోడించువారు కొందఱు. ఇంతేకాని వెనుకఁ జెప్పిన మాటకును, పాట పద్యములలోని యెత్తుగడ మాటకును పొత్తు కుదిరినదా యని యైన విచారించి కూర్చువా రరుదు. ఇఁక రాగ తాళములు రసభావములను పోషించుచున్నవా యని విమర్శించు మాట చెప్పఁ బనిలేదు.

ఇఁక రెండవ కష్టము నటులది. వారి కేమైన కొంత సంగీతము అ ఆ ఇ ఈ లు వచ్చి యుండెనా - అమరకోశమున మాత్రము నిలిచియున్న హాహా హూహూ గంధర్వులు సాక్షాత్తుగా మనయెదుట ఆవిర్భవించినట్లై కచ్చేరీలకు మొదలుపెట్టి తబలా హార్మోనియము వారితో స్పర్థకు నిలిచి రసరంగమును రణరంగముగా మార్తురు. కవి, కథ, పాత్రములు వీనిగతి యేయేటఁ బోయినను వారికి చింతలేదు. అభినయవిద్యయం దసాధారణ చాతుర్యము గలిగి ఇప్పటి కర్ణాటకనటుల కనేకుల కాదర్శప్రాయుఁడుగా పరిణమించి అర్హతకు దగిన మహాప్రఖ్యాతినందిన వరదాచార్యునివంటి వారియందే ఈ

గుణము ముదిరి అసహ్యముగా నుండెడిది. ఇఁక సామాన్యులమాట యేల? మాటకుఁ దగినపాట యొక వేళ కవి వ్రాసినను దాని రాగ లయల విలువ నెఱిఁగి తగినంత నియమములో, స్వరభేదములతో పాడి రసభావములను పోషించుశక్తిగల నటు లిప్పుడే కాదు ఎప్పుడైనను కొందఱే. నేను జూచిన నటులలో - నేను చాల మందిని చూడలేదను మాట సత్యము - ఒక స్థానం నరసింహారాయలకే యీ రహస్య మర్థమైనట్లు తోఁచినది.

ఇఁక మూఁడవ కష్టము మనది; అనఁగా చూచు సభ్యులది. నా భార్య యింటిలో ఎట్లేడ్చునో నలుని భార్యయు నట్లే యేడ్వవలయునే కాని ఒక్క కన్నీరుబొట్టుగూడ ఎక్కువగాఁగాని, తక్కువగాఁగాని కార్చరాదని తలఁచువారిని, స్వభావమను పదార్థమునకుఁ గల లోఁతును దిగిచూడకయే ఇది స్వాభావికము, అది అస్వాభావికము అని నిర్ణయించు కొన్నవారిని, తమ హృదయతత్త్వమును బరీక్షింపక యెవరో చెప్పిన అపసిద్ధాంతములనే పట్టుకొని అల్లాడువారిని రంజింపఁ జేయుట చాల కష్టము. మనవారికి పద్యములు, పాటలు రుచింపవని కాదు. కవిత్వమును వారు మెత్తురు; పాటకును పరవశులు కాఁగలరు. నాటకములం దీ రెంటికిని దేవుని సాక్షిగా చో టీయఁ గూడదని మొండిపట్టు పట్టుదురు. ఇది రుచిలోపము కాదు. అభిప్రాయలోపము. ఇఁక నాటకములందు పై రెండు ఉండవలయు ననువారు కొందఱితో మఱియొక కష్టము. వారి పాలిటికి ప్రాస యమక శ్లేషాది పూర్ణములై నాట్యమును కొంత ప్రొద్దట్లుండనిచ్చి నిఘంటువులను చూచు నట్లు చేయఁజాలినవే పద్యములు.

అరయరే తరుణి నిర్ఝరిణులార ప్రమత్త
కరిణులార విభీతహరిణులార ... 4

ఇటువంటి పద్యములు వ్రాసినందుకు కవినీ, ఆప్రాసము లట్లే చెక్కు చెదరక యొత్తిపాడిన నటునీ వారు 'బలే' యందురు. పాటలందును ఇట్లే.

ఇట్లనుటచే పద్యములును, పాటలును నాటక ప్రపంచము నుండి బహిష్కారము చేసిన బాగేమో యనిపించుట సహజము. కాని యిట్టికష్ట మెందులో లేదు? నాటకకళకు మూలవస్తువగు అభినయములో లేదా? భావము తీవ్రముగా నున్నచోట జాలి మొద్దులువలె నిలుచుకొనువారు లేరా? సామాన్య భావమునకుఁ గూడ పంచప్రాణము లెగిరి పోవునట్లు, రక్తనాళముల బిగఁబట్టి, పండ్లుగొఱికి, మొగము సింద్రించుకొని, వెంట్రుకలు గుంజుకొని, కనుగ్రుడ్డులు తేలవేయు వారు లేరా? వన్నె వేసికొనుటలో మొగమంతయు తెగఁ దిక్కిన తామ్రపు చెంబువలె వికారము చేసికొనువారు లేరా? సదుపయోగశక్తి లేక దురుపయోగశక్తి గలిగి యుండిన యెడల ఏ వస్తువు నైనను జెఱుపవచ్చును. ఒక కవిత్వ సంగీతములను మాత్రమేనా? అట్టిచో మొదటిశక్తిని వృద్ధి చేసికొని రెండవదానిని వదలుటకు ప్రయత్నము చేయుట ధీరగుణముగాని అసలు పదార్థమే వదలుట కళావంతులవంటి తపస్వులకు తగనిపని. మరల నొకమాఱు నా మనవి యేమనఁగా: స్వభావము అనునది అమేయము, అగాధము. దాని మేర యింతే యని యెఱుఁగ నెవరితరమును గాదు. మఱి సాధ్యమైనంత దాని లోఁతును జూచుటయే కళలపని. కాలుపెట్టి చూడని యెడల అది అంతరగంగ కప్పిన బావివలెఁ గానవచ్చును. అంతకే మోసపోరాదు.

మధ్యవర్తి వివేకులు కొందఱు ఈసందర్భమున ఒక కోమటి తీర్మానము చెప్పుదురు; ఏమనగా: "గంభీరములు, తేలికయైనవి యని రూపకములు రెండు విధములు. మొదటి తరగతిలో పురాణకథలను, చరిత్రకథలను బట్టి వ్రాసిన నాటకములు చేరును. సాంఘికనాటకములు రెండవ తరగతివి. అనఁగా సమకాలీన జీవితము నాశ్రయించి వ్రాయఁబడినవి. గంభీరనాటకములలో పద్యములు, పాటలు ఇష్టమున్న వేసికొనుఁడు. కాని రెండవ తరగతి వానిలో మాత్రము అవి అసందర్భములగును" 5 అని. అస లీ విభాగమే నా కర్థము కాలేదు. నేఁటి జీవితము రేపటికి చారిత్రము, మర్నాటికిఁ

పురాణము. ఇది కేవలము విభాగ ప్రియులగు విమర్శకులకు, లాక్షణికులకు తృప్తికరమగునేమో కాని రసికులకు నిరర్థకము. రసము గల్గింపఁగల సన్నివేశములు నిన్న మొన్నటివలె నేఁడును గలవు. రసము ననుభవించి యానందించు సత్త్వమును మనకుఁ గలదు. ప్రాచీనులకును, మనకును ప్రమాణములో భేదమున్నది. వారు పూటకు రెండు సేర్ల అన్నము భుజించిన, మనము పావుసేరు భుజింతుము. కాని ఆఁకలివిలువ యిద్దఱకును ఒకటే. ఆ కాలపు తల్లులు నూర్లకొలది బిడ్డలను గనిన, మన తల్లులు నలుగు రైదుగురు పిల్లలఁ గందురు. కాని మాతృవాత్సల్య మొకటే. వారు నమ్మిన విషయములను మనము నమ్మకపోవచ్చును గాని నమ్మిన విషయములందు మనోబల మొక్కటే. బహిరంగములలో భేదముండవచ్చును గాని అంతరంగమందు లేదు. అదియే కళావస్తువు జీవనము గదా! అది యొక్కటి సృష్టిలో నుండువఱకును, ఏ కళగాని స్వతంత్రముగా, సంపూర్ణముగా దానిని అనుకరింపఁ జాలదనుట సత్యములలో సత్యము. కాఁబట్టి ఆధునిక సమకాలీన జీవన మందలి తత్త్వమును కేవలము మాటలు, అభినయము వీనితోనే నిర్వహింపఁ గలమనుట నాకుఁ జూడఁగా అర్థములేని అహంకారము. పాటలు, పద్యములును ఇందు చేరుట అస్వాభావికమనుట మన స్వభావజ్ఞాన మింతయనియే తెల్పునుగాని వేఱుకాదు. కనుక సమకాలీన జీవితము నాశ్రయించిన నాటకములు 'తేలిక' గా నుండవలసిన పనిలేదు. అవియును గంభీరములే యగును. గంభీరమగు భావరసములను గ్రహించి కూర్పఁ గల్గినచో, ఇఁక తేలికగానుండు నాటకములు లేవని కాదు, తేలికయైన విషయములు ఏకాలమందును గలవు. వానిని గ్రహించినప్పుడు నాటకములు తేలిక కాక మానవు. మఱియు, కవులకు నటులకును తెలివిలేకున్న రెండును తేలిక యగును. ఎన్నియో పురాణ చరిత్ర నాటకములఁ జూచిన నాకు నవ్వు వచ్చును. వానిలో పనికిమాలినచోట్ల పద్యములు, పాటలు నించియుండుట చూచి, వానిని చక్కఁగా పాడలేని నటులనుజూచి దుఃఖము వచ్చును. అది యట్లుండె.

రంగస్థలమున స్త్రీపాత్రములను స్త్రీలే వహింపవలయు నను పైస్వభావవాదముయొక్క వేఱొకపరిణామమును గూర్చి రెండు మాటలు మనవి. దీనిని రెండు త్రోవలఁ బరీక్షింపవలసి యున్నది. ఒకటి కళ, రెండవది నీతి. కళాదృష్టితోఁ జూచిన పక్షమున స్త్రీలు రంగమున కెక్కుటచేత అభినయకళ వృద్ధి నొందినదని చెప్ప వీలు లేదు. కారణమేమనఁగా, కళ వ్యక్తికిఁ జేరినదిగాని జాతికిఁ జేరినది గాదు. స్త్రీజాతిలోఁ బుట్టిన మాత్రమున స్త్రీత్వమును చక్కఁగా నభినయింపఁగలరని చెప్పుట కెవరును సాహసింపరుగదా! నే నెందఱో స్త్రీలు అభినయించుట చూచినాను. వారిలో చాలమంది యత్నముచేత స్త్రీలుగా నున్నారేకాని అభినయమును జూచినచో వారు స్త్రీలునుగారు, పురుషులునుగారు. అట్లే పురుషులందరును పురుషపాత్రమును సరిగా నిర్వహింపలేరనుటయు మన మందఱమును చూచిచూచి వేసరిన విషయము. వారిలోఁ గానిఁ వీరిలోఁ గాని కొందఱికే అభినయ శక్తి యుండును. తమలో లేనిధర్మము నారోపించుకొని యనుకరించుటయే కళాకౌశల్యమందలి ముఖ్యతత్త్వ మనుటయు అందఱెఱిఁగినదే. అట్లున్నప్పుడు అట్టియభినయశక్తి గల వ్యక్తి పురుషుఁడైన పురుషపాత్రమునే, స్త్రీయైన స్త్రీ పాత్రమునే వహింపవలయునను నిర్బంధమేమి? పురుషులు స్త్రీపాత్రమును చక్కఁగా నిర్వహింపలే రనుట అనుభవ విరుద్ధమైన విషయము. స్థానం నరసింహారావు, మైసూరు శామణ్ణ 6 మొదలగువారు స్త్రీ మనస్తత్వమును జూపుటలో ప్రదర్శించినశక్తి చూచినవా రందఱును ఎన్నఁడు మఱవ రానిది. పురుషుఁ డెంత నాజూకుగా వేషము వేసికొన్నను అచ్చపుటాఁడుదానివలె కానరాఁడనుట కొంతవఱకు సత్యమే. కాని అచ్చపు టాఁడుది యనఁగా ఇట్టిది యని చూపుటకా రంగస్థల మేర్పఱచినది? అమ్మలు, అక్కచెల్లెండ్రు, ఆలుబిడ్డలు ఇంటిలో లేరా? ఇరుగు పొరుగువారికి నుండరా? వారి ఆఁడతనములో మనము చూడని అచ్చమును వారిని రంగమున కెక్కించినమాత్రాన చూఁడగలమా? మఱియు ఈ అచ్చపు ప్రశ్న ఒక ఆఁడవేషమునకేనా వచ్చినది? ముసలివేషము వేసినవారిలో చర్మమునకు ముడుతలు చూపఁగల యభినేత యున్నాఁడా? అందుకై ముసలివానినే యేఱితెచ్చి ఆ వేషమునకు

నియమింతురా? అట్లయిన దుష్యంతుని వేషమునకు దొరనే యెవనినైనఁ బట్టుకొని రావలయును. ఇఁక హనుమంతుని వేషమునకు రావలసిన దెవరు? ఈ వ్యవహారము తెగుట యెప్పటికి? అభినయించునది నిజముగా ఆడఁదా, మగవాఁడా యను చింత కళానుభవముగల రసికులకు కలుగనే కలుగదు. కొందఱికి కలిగినను వారికి సంస్కారము చాలదనియు, అచ్చపు టాఁడువారిని జూడవలయునన్న వారు పోయి చూడవలసిన చోటు వేఱనియు చెప్ప వలసియుండును. ఇఁక నాయకవేషము ధరించినవానికి నాయికాపాత్రము వహించి యుండునది నరసింహారావుగాని నరసమ్మగాదని నిరుత్సాహము జనించునేని అట్టివానికి రంగస్థలము మెట్లు త్రొక్కుట కధికారము లేదంతే. కాఁబట్టి స్త్రీ పాత్రమును స్త్రీలే వహించుటవలన కళకు ప్రత్యేకమగు మేల్మి యేమియును లేదు. అభినయించువారి సంఖ్యను పెంచినట్లగు నంతే. వారి కభినయశక్తి కలదేని మగవారివలె నన్నిపాత్రములను వహించు నవకాశమును కల్పింపవచ్చును. కాని యిదివఱ కెవరును ఆ యౌదార్యమును వారి యెడల చూపినట్లు కానము. ఏల? అవకాశ మిచ్చి చూడుఁడు. మగవారు మగపాత్రను వహించి చూపు నభినయముకంటె ఆఁడవారి పురుషపాత్రాభినయము ఏమిటను తక్కువగా నుండదనుట నా నమ్మకము.

ఇట్లు కళాదృష్టితోఁ బరీక్షించితిమేని స్త్రీలు రంగమున కెక్కుటచే కళకు విశేష లాభ మేమియు లేదని యేర్పడఁగా నీతిదృష్టితోఁ జూచినపుడు గొప్పనష్టము గలదనియు మనము గమనించిన విషయమే. కళాప్రపంచమున నీతిదృష్టి యెందుకని ప్రశ్నించువారు లేకపోలేదు. మనుష్య జీవితమునకును నీతికిని వీడరాని సంబంధ ముండఁగా మనుష్యుఁడు ఆత్మక్షేమమునకై సృజించు కళమాత్రము నైతిక ప్రపంచము నుండి పూర్తిగా ఎట్లు వేఱుపడునో నాకర్థము కాదు. మఱియు స్త్రీవేషములు స్త్రీలే ధరించి పురుషులతో రంగమందు వ్యవహరించుటవల్ల చూచువారి నీతి కంతగా నష్టము లేదు. కథాప్రవాహమునఁ దన్మయులై యుండువారికి సావిత్రి వేషము వేసినది ఏసానియైనను,

సంసారియైనను రసానుభవమునందు భేదముండదు. వారు రంగముపై సంబంధము గలిగియుండునది ఆరోపితమైన పాత్రముతోనేకాని అసలువ్యక్తితోఁ గాదు. మఱి యీ నీతిప్రశ్న నటుల యోగక్షేమములఁ గూర్చినది. అభ్యాస కాలమందును, అభినయించు నప్పుడును వారు పరస్పరము చాల సమీపముగా వ్యవహరించ వలసినవారు. అభినయించునప్పుడును భావము లెంత తీవ్రముగా నున్నను తమతమ స్వరూపములను కొంచెమును ఏమఱక యుండువారు; ఉండవలసినవారు. అట్టిచో నిజమైన భార్యాభర్తృసంబంధము లేని స్త్రీపురుషులు రంగమున అనేక విధముల వ్యవహరించునపుడు వా రొకరొకరి వలపులో పడకయుండుట సామాన్యముగా అనుభవమునం దసాధ్యమైన విషయము. "స్త్రీపురుషుల పరస్పరాకర్షణశక్తి దూరదూరముగా నున్నప్పుడే యుండును గాని వారికి సామీప్యవర్తన మధికమైనట్లెల్ల, మైత్రి పెరిగినట్లెల్ల అది కృశించును, కావున నీతికి భంగము లేదు సరికదా భద్రమే యెక్కువ" యనువాదము సత్యమని నమ్ముధైర్యము నాకు లేదు. పరస్పరాకర్షణ యీ రెండుజాతులకును సృష్టిమూలమై బలవత్తరమైన ధర్మము. దూరముగా నున్నప్పుడే యుదాసీనత యెక్కువ యనియు, సమీపించినట్లెల్ల రూపగుణాది విశేష ధర్మములచే కొన్నిచోట్ల కృశించినను, మఱికొన్నిచోట్ల దాని ప్రాబల్యము మఱింత యధికమగుననియు చెప్పుటయే యెక్కువ సత్యమను విషయములో నాకు సందేహములేదు. ఇది సాధారణ మనుష్యుల మాట. విశేషవ్యక్తుల చింత మన కప్రకృతము. ఇప్పటికిఁగాని, యెప్పటికిఁగాని నాటకములలోఁ జేరి యభినయించు నటు లందఱును నావంటి నామాన్య మనుష్యులే కాని మహర్షులు ప్రాయికముగా కారు; మహాపాపులును గారు. అట్టివారిట్టి అగ్గితో చెరలాటము - కత్తిమీఁద సాము చేయుట, వారిని చేయనిచ్చుట సామాన్యమైన సాహసము గాదు. సంఘముయొక్క ధర్మమునుగాదు. నీతి సామాన్య మనుష్యుల దేహ మనస్సులను ఆరోగ్యముగా నుంచుట కేర్పడిన కట్టుఁబాటు. ఆ యారోగ్యమును చెఱుచు విషబీజములలో ముఖ్యమైనది స్త్రీపురుషుల స్వచ్ఛంద వర్తన మనుట అంద ఱన్ని కాలములందును అనుభవించి యంగీకరించినదే. దానిని మన

మల్పముగా చూడవచ్చునా? ప్రోత్సహించ వచ్చునా? మనలో ఈ విషయమున నీతిశాస్త్రములు అనావశ్యకమైన, అన్యాయమైన నిర్బంధముల నేర్పఱిచినవి గావున వానిని అక్షరశః గమనించి నడచుట పొరఁబాటని కొందఱు వాదింతురు. కొంత నిజమే. కాని అట్లు వాదించువారును ఏవో కొన్నియైన నిర్బంధములను పెట్టుకొనక తీఱదు. లేకున్న నీతికిని, కామవర్తనకును సంబంధమే లేదని చెప్పవలసి వచ్చును. మనుష్యుల దేహ మనస్తత్వముల నెఱిఁగి యోగక్షేమ చింతగల యేవివేకిగాని యట్లు చెప్పఁడని నా నమ్మిక. కావున అట్లు మనము ఈవిషయమున నుంచు కొనవలసిన కట్టుపాటు లేవి? పరపురుషుఁడు పరస్త్రీతో ఎంతవరకు వ్యవహరింపవచ్చును? ఏ మేర మీఱినప్పుడు నీతికి భంగము? ఆ మేర మీఱకుండుటకై పుచ్చుకొను జాగ్రత్త యెట్టిది? ఇత్యాది ప్రశ్నలకు తృప్తిగా, బహిరంగముగా సమాధాన మీయవలసి యున్నారు నీతిశాస్త్ర సంస్కారులు. ఆ నిర్ణయము చేయక మునుపు ఇట్టి తెగువపనులకు చేయి వేయుట సంఘవిషయమున చేయు గొప్ప యపరాధము. ఇఁక ఇట్టి నిర్ణయమునకు మనుష్యసంఘ మంతయు వచ్చుట యెన్నఁడు? అంతవఱకును స్త్రీలను రంగమునుండి దూరముగా నుంచవలసినదేనా? అను ప్రశ్న వచ్చును. మనుష్యజాతి కంతయు ఒక నీతిశాస్త్ర మేకాలమందును లేదు. కాని నీతిని సంపూర్ణముగా ఉదాసీనము చేసిన జాతి యే దేశమందును, ఏకాలమందును ఉండదు. ఆ యా సంఘములందలి నాగరకత ననుసరించి, నీతికి భంగము కలుగు వేఱువేఱు సన్నివేశముల ననుసరించి, వేఱువేఱు విధములుగా వారు దానిని పదిలము చేసికొందురు. అట్లు మీరును నీతిని నమ్మినవారేకదా! దానికి భంగము రానీక మీరు చేసికొన్న కట్టుపాటులేవి యనుట బహిరంగముగా చెప్పుడనుటయే నాప్రార్థన. ఆఁడువారు పురుషులతోపాటు రంగమెక్కక దూరముగా నుండిన పుట్టి మునిఁగిన దేమియు లేదు. లేదా, స్త్రీలే ప్రత్యేకముగా తమ యభినయకళను బ్రదర్శించు మార్గము కల్పించు కొనవచ్చును.

మఱియు నీతి సాధింపవలసిన ధర్మముకాని సహజమగు గుణముగాదు. దేనిని సాధింపఁ బూనుకొందుమో దానిని విఘ్నము గలిగించు సన్నివేశములనుండి సాధ్యమైనంత వఱకు తప్పించుకొని పోయినపుడే మన ప్రయత్నము కొంత వఱకైన నెగ్గును. నీతి మంతులని పేరుపడినవా రందఱు చేసిన పనియు, చేయఁగల పనియు ఇంతేకాని వేఱుకాదు. కాబట్టి నాటకములందు స్త్రీలను చేర్పనివారందఱు చాల నీతిమంతులుగా నున్నారా యని యెవరైనను ఎగతాళి ప్రశ్న వేసిరేని దాని కర్థము లేదు. దుర్నీతి కలుగు అవకాశమును ఆ యింతమాత్రములో దూరముచేసినవారు వా రనుట సత్యమనక తప్పదు. ఇట్లే నాటకములందు చేరిన స్త్రీపురుషు లందఱు నీతికి దూరులా యనుటయు పిల్లతనపు ప్రశ్నయే. అట్టి సన్నివేశములలో ప్రాయశః నీతికి భంగము కలుగ వచ్చుననుటయే మన వాదము. అంతకన్న ఎక్కువగా అట్టి స్త్రీపురుషుల జీవితముగూర్చి మనము తెలిసికొనలేము; అక్కరయును లేదు. వారును మనవంటి రక్తమాంసమయమగు మనుష్యులే కావున మనకుఁ గల కామక్రోధాదులు వారికిని గలవని యూహించుటచే, అట్టి సన్నివేశములందు మనమే యుంటిమేని హృదయదౌర్బల్యము నడఁచుకొని నీతిని నిలుపుకొనఁగల స్థైర్యము మన కుండదను నమ్మికచే ఇట్లు వాదింపవలసి యున్నది. రంగస్థలమున నిప్పుడు కలియుచున్న స్త్రీపురుషు లందఱు జితేంద్రియులగు అసాధారణ వ్యక్తులని ప్రపంచమునకు స్పష్టమయ్యేనేని అప్పు డిట్టి ప్రశ్నలు రంగమందుఁగాని, బైటఁగాని రానే రావు. ఎందఱు మీరాబేనులు, ఎందఱు నీలనాగిణులు ఏకాంతమందు పరివారించి యున్నను ఆ మహాత్మగాంధినీతిని ప్రశ్నించు నక్కర గాని, ధైర్యముగాని యెవరికిఁ గలదు?

ఈ విషయమున ఆంధ్రనాటక పితామహుఁడు రామకృష్ణమాచార్యుల యభిప్రాయ మెట్టిదో తెలియు వీలు నాకు లేదు. కాని వారి సరసవినోదిని సభలో ఎప్పుడుగాని స్త్రీ నటులను వారు జేర్పకయుండుట ప్రసిద్ధ విషయమే. కావున వా రిప్పుడు జీవించియుండు భాగ్యముండిన నాతో ఈవిషయమున నేకీభవించి యుందురను పేరాస నాకుఁ గలదు. శ్రీ

కోలాచల శ్రీనివాసరాయలును తమ సుమనోరమసభలో స్త్రీలకు చోటియ్యలేదని విన్నాను. కాని వారి 'ప్రపంచ నాటక చరిత్ర'లో 'ఇంగ్లీషు స్త్రీలయంత మనస్త్రీలు చదువు కొనువఱకు, వారియంత నాగరకత మనము సంపాదించు కొనువఱకు మనస్త్రీలు నాటకరంగ మెక్కరాదని నా పేరాస" అని వ్రాసిరి (పు. ౧౨౫). అనఁగా తరువాత ఎక్కవచ్చు నన్నమాట. కాని చదువు, సంప్రదాయములు వేఱు, నీతి వేఱు. చదివిన నాగరకులందఱు చదువని అనాగరకులకన్న ఎక్కువ నీతిమంతులుగా నున్నారని చెప్పు ధైర్యము నాకు లేదు. ఇది మన స్త్రీలను గూర్చి మాత్రము చెప్పవలసిన మాటకాదు. ప్రపంచమందలి స్త్రీపురుష సామాన్యులకును సంబంధించిన సమస్య యిది. ఇంగ్లండు మొదలగు దేశముల లోని నట స్త్రీపురుషులు మనదేశమువారికన్న ఎక్కువ నీతిమంతులని ఆదేశములకు పోయి చూచివచ్చిన యెవరుగాని దృఢముగా నాతోఁ జెప్పలేదు. నేను ఎఱిఁగినంతవఱకును వారి సాహిత్యమున ప్రతిఫలించిన సంఘజీవితముఁ జూచిన అట్టి నమ్మికకు అవకాశము లేదు. ఇన్నాళ్ళవలె ఏనలుగురు ఇంగ్లీషువారో, లేక వారి యుప్పుదిన్న కింకరులో యీ దేశమునకు వచ్చి, ఆచార్యపీఠము నధిష్ఠించి పాశ్చాత్యదేశము లన్నియు పవిత్రమూర్తులని, నీతి న్యాయము లచ్చటనే అవతరించినవని వర్ణించి ప్రబంధకవిత్వ కల్పనలతో ఇప్పుడు మనలను బేలుపుచ్చుటకు సాధ్యముకాదు. నైతికముగా వారి సంఘమందు జరుగుచున్న యల్లకల్లోలమును వారి సాహిత్యమే కన్నులుగలవారి కందఱికిని ఘంటాఘోషముతో చాటుచున్నది. కాబట్టి శ్రీనివాసరావుగారి యాశ నాకు లేదు. స్త్రీపురుష వ్యవహారమునకును, నీతికిని సంబంధముండువఱకును నేఁడుగాని, రేపుగాని ఆ యిరువురును అన్ని సన్నివేశములందును చాల మెలఁకువతో సంవ్యవహారము నడువక తీరదని నా దృఢాభిప్రాయము.

స్త్రీజాతి విషయమున నింతటి యధికారమును ఈ యిరువదవ శతాబ్దమునఁగూడ చెలాయించుట నాగరకత లక్షణము గాదని యొక వాదము. కాని నా వాదము స్త్రీలకు

మాత్రము సంబంధించినది గాదు; మనుష్యజాతి సామాన్యపు యోగక్షేమములఁ గూర్చినది. స్త్రీపురుషులలో ఒకరు చెడి యొకరు పవిత్రులుగా నుండుట యెన్నఁడును సంభవింపదు. చెడిన నిరువురు జెడుదురు; తప్పిన నిరువురును తప్పుదురు. కాఁబట్టి యీ విషయమున ఎక్కువ తక్కువ లెవరికిని లేవు. మఱియు మాతో మీరు రంగమున కెక్కవలదని మగవారు చెప్పుట స్త్రీలపై నధికారము చెలాయించుట యగునేని, మీజతకు మేము రామని తిరస్కరించు నధికారము స్త్రీలకును కలదుగావున ఇరువదవ శతాబ్దపు నాగరకత భద్రముగానే యుండును, దీనికిఁ దోడు స్త్రీలే ప్రత్యేకముగా అభినయ సంఘములను స్థాపించుకొనిరేని మగవారిని రావలదని నిషేధించు నధికారమును వారి కబ్బినట్లయి తూనిక సరిపోవును. మఱియు అధికారము చలాయించుటయే యపరాధమా? అట్లేని మగవారి నీతిరీతులను గూర్చి మగవారిప్పు డెన్ని విధముల నపరాధ పడుచుండలేదు? ఆఁడవారిని గూర్చినప్పుడు మాత్రము ఈజోలి మనకేల యని యూరకుండ వలయునా? ఏల? వారేమి యేయడవులలోనో వసించు మృగజాతివారా? మనుష్యులు కారా? వారును వీరును కలసిమెలసి యుండవలసి యుండఁగా, ఇద్దరికిని పరస్పర సహవాసమున లాభనష్టము లెన్నోయుండఁగా, దానికిఁ దగినట్లు వ్యవహారపు నియమముల నేర్పఱచుకొనుట అనాగరకత యగునా? నియమములేని స్వేచ్ఛావర్తనమే నాగరకతయేని యది యెంతత్వరలో నశించిన నంత క్షేమము.

1[1] మాలవికాగ్నిమిత్రము అం.౧, ప.౪

2[2] భాషలేని వట్టి వాద్యసంగీతమందును, అంతకన్న నెక్కువగా అభినయమున కవకాశములేని గ్రామఫోనుల పాటలందును మనకుఁ గల యతృప్తి స్పష్టమే.

3[3] ధ. కృ. గారి 'పాదుకాపట్టాభిషేకము'.

4[4] ధ. కృ. గారి 'చిత్రనళీయము' అం. ౩. ప. ౩.

5[5] Tragedies and Comedies.

6[6] మైసూరుమహారాజుల నగరి యాజమాన్యమున కొన్నేళ్ళక్రిందటివఱకు సుప్రసిద్ధముగా నుండిన శ్రీచామరాజేంద్ర కర్నాటక నాటకసభలోని యసాధారణాభినేతలో నొక్కఁడు; ఇప్పుడు కీర్తిశేషుఁడు.

స్మారకోత్సవ సందర్భమునఁ జేసినవి.

భారతి ౧౯౩౫ జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ (సంపుటి ౧౨ - సంచికలు ౧, ౨, ౩, ౪)

నాటకములు తెలుఁగులో వ్రాయుటకు పునాదివేసిన యగ్రేసరులలో కీర్తిశేషులగు ధర్మవరము రామకృష్ణమాచార్యులును, కోలాచలము శ్రీనివాసరాయలును గణనీయులు. తెలుఁగు రూపకముల చరిత్ర వ్రాయువారు వీరి పేరులు మఱచుటకు వీలులేదు. కృష్ణమాచార్యులే మొదట తెనుఁగు నాటకము రచింప నుపక్రమించిన ధీరుఁడని కొందఱి నమ్మిక. కాదనియు, ఆ మర్యాద వీరేశలింగము పంతులకో, మఱియెవరికో చెల్లవలయుననియు మఱియొక వాదము. దీనిని నిర్ణయించు నాధారములు ప్రకృతము నావద్ద లేవు. "ఈ సభ (సరసవినోదిని సభ) యుద్భవించి 'చిత్రనళీయము' రచించు వఱకు నీ భాషయందు స్వతంత్రనాటకము లుండలేదు" అని కృష్ణమాచార్యుఁడే యొకానొక కరపత్రమునఁ బ్రకటించెను. అనఁగా అదివఱకున్నవి వీరేశలింగము పంతులు మొదలగువారి సంస్కృతాంగ్ల నాటకముల పరివర్తనములేనా? చెప్పలేను. మఱియు ఒకవేళ కృష్ణమాచార్యుఁడే ఆంధ్రమున ఆది నాటకకర్తగా ఏర్పఱుపఁ గలిగినను అది యంతగా గర్వపడవలసిన విషయముగాని, దుఃఖపడవలసిన విషయముగాని కాదని నా తలపు. ఎందుకనఁగా ౧౮౫౩ - వ సంవత్సరమునకు కొంత ముందుగానో వెనుకనో ఆయన జనింపకపోవుట ఆకస్మికమే తప్ప అతని తప్పొప్పులుగావు. మఱి యెవరివియుఁ గావు. కాఁబట్టి కేవలము కాలమునుబట్టి కార్యమునకు విలువ గట్టుట ప్రాయశః కృత్రిమమైన దురభిమానములను బెంచునే కాని హార్దమగు గౌరవప్రీతులను బెంపదు. ఇఁక శ్రీనివాసరాయల విషయమున ఈవివాద మున్నట్లు లేదు. కృష్ణమాచార్యులకన్న కొన్ని నెలలు మాత్రము వీరు చిన్నయైయుండి బ్రతికియున్నన్ని నాళ్ళును నాటకరచన ప్రధానకార్యముగా ఇంచుమించు వారు వ్రాసినన్నియే నాటకములు రచించిరి. కాని వీరు

నాటకరచన నికరముగా ఎప్పు డుపక్రమించి రను తేదీ నాకింకను తెలియలేదు. ప్రకృతము నా పనికి అక్కరయు లేదు.

నాలుగునాళ్లు వెనుకముందుగా ఎవరు వ్రాసినను, వ్రాయకున్నను ౧౯-వ శతాబ్ది ముప్పాలు కడచువరకును మనలో నాటకము లెవరును రచింపకపోవుటకు సంకోచింపవలసి యున్నదే కాని వ్రాసినవారిలో నెవఁడు మొనగాఁడను చర్చకుఁగాని, అహంకారమునకుఁగాని యర్థ మెక్కువ లేదు. అప్పటికి రెండువేల యేండ్ల క్రిందనే సంస్కృత ప్రాకృత భాషలలో అపూర్వమైన నాటకరత్నము లెన్నో పుట్టియుండి, నాటకమనఁగా నేమి యని తెలియనివారుగూడ లక్షణగ్రంథము లనుజూచి రచించునంతటి యధోగతికి ఆవిద్య దిగియుండెను. సంస్కృతభాషలో నున్నవానివంటి యుత్తమనాటకములు గాని, అధమనాటకములుగాని యే భాషలోనైనను ఇప్పటికైనను గలవా యను సందేహము నాకున్నది. తెలుఁగు సాహిత్యములో పనిచేసిన వా రందఱును సంస్కృతసాహిత్యమందు కొంచెమో గొప్పయో పరిచయము గలవారే. అట్లున్నను మొన్న మొన్నటివఱకు తెలుఁగురూపకములు యక్షగానముల యంతస్తును దాఁటి పెరుగకపోవుట తెలుఁగువారి యధైర్యమును, చాదస్తమును, సోమరితనమును దెలుపునేకాని వేఱగునా? లక్షణదృష్టితో చూచితిమేని తెలుఁగులో నాటకములు వ్రాయఁదలఁచిన వారు చేయవలసిన పనియెల్ల ఆ భాషలోనుండి ఈ భాషకు అర్థభావములు మార్చుటయే. తక్కిన సామాన్య లక్షణమగు గద్య పద్య రచన మనవారికి క్రొత్తగాదు. ఐనను పందొమ్మిదవ శతకపు తుదలో ఆంగ్లసాహిత్య వ్యాసంగము స్థిరముగా నిలిచి స్వతంత్ర బుద్ధిని ప్రేరేచి నరముల నల్లాడించువఱకును మనవారు మేలుకోలేదు. మనవారిని మాత్రము దూరనేల? భరతఖండములోని యన్ని భాషలవారిగతియు నట్లే యున్నట్లున్నది. అట్లు మేలుకొలుపులకు చిక్కి లేచి నాలుగుదిక్కుల పరువులెత్తిన కార్యశూరులలో మన కవిద్వయమును జేరి పనిచేసిరి. అది పందెము వేసికొని యెత్తిన

పరువుగాదు. ప్రవాహమునకు చిక్కికొట్టిన పరవశమైన యీఁత. నాలుగుగడియలు నాలుగడుగులు ఎవరు వెనుక ముందైనను దానికి విలువలేదు.

వా రా మార్గమున ఎంతదూరము పోయిరి? ఏమేమి సాధించిరి? ఏమేమి వదలిరి? వారి మార్గము ప్రకృతము మన మెంతవఱకు ననుసరించవచ్చును? అనునదే సింహావలోకన న్యాయమున ప్రకృతము మనము చేయవలసిన చర్చ. ఇది వారియందలి గౌరవముచేఁగాని, యీర్ష్యచేఁగాని చేయు గుణదోషవిమర్శ కాదు. ఆ దృష్టిచే కీర్తిశేషులగు ఆ యిరువురు మహనీయులకు ఎట్టి లాభనష్టములు గలుగఁ జాలవు. మఱి వారు చూపిన మార్గముననే పోవుచు, వారివలె యథాశక్తిగా ఆంధ్రసాహిత్యమందు పనిచేయుచునో, చేసిన, చేయుచున్న వారి పనుల ఫలము ననుభవించుచునో యున్న మనకు ఆంధ్ర నాటక రచనా శిల్పము నింకను పెంచి పెద్ద చేయవలయునని కోరికకలదు. దాని పరమావధిని దాఁకు పేరాశ కలదు. కావున ఇప్పుడు మన యనుకూలమునకై ఆత్మసాక్షికముగా వారి పను లొక్కమాఱు కలయఁ జూచుట తప్పనిసరి.

ఆంగ్ల సామ్రాజ్యము మనదేశమున తేజోవంతమై వేఱూని చోటు చేసికొనుచుండిన కాలములో వీ రిరువురును, జనించినవారు; దాని ఫలమగు స్వస్థతను, శాంతిని పూర్ణముగా ననుభవించినవారు; ఆంధ్ర సంస్కృత సాహిత్యములకు తోడు ఆంగ్లసాహిత్యమును చక్కఁగా చదువుకొన్నవారు; ఆ సామ్రాజ్యమున కెదురుతిరిగిన దేశీయశక్తులు ప్రబలమై అల్లకల్లోలము చేయుటకు మునుపే దేహయాత్ర చాలించుకొన్న యదృష్టవంతులు; ఆ నెమ్మదికి ఫలముగా తమకుఁ గలిగిన ప్రాచ్య పాశ్చాత్య సారస్వత పరిచయము మూలమున తమ మాతృభాషను, తన్మూలమున దేశీయులను వృద్ధికిఁ దేవలయునని యుద్రేకముతో ప్రవర్తించినవారు. కాని వీరేశలింగము పంతులు మొదలగు కొందఱవలె అన్ని త్రోవలలోను నడవఁ బోయి అవకతవకపని చేయలేదు. నాటకములు తెలుఁగులో లేని కొఱఁతను దీర్చుటకును, నట్టువలలోను, దాసర్లలోను నిలిచి

యపభ్రష్టముగా నున్న యభినయవిద్యకు మంచిగతిఁ గల్పించుటకు పూనినారు. దానికితోడు ఇందుమూలమున దేశమందలి దుర్నీతిని బోఁగొట్టఁ గలమను గట్టి నమ్మకమును వారి కుండెడిది. కావున ఇరువురును చెఱి సుమారు ముప్పదింటికి మించి వివిధరూపకములను రచించుటయే కాక ప్రత్యేకముగా 'సరసవినోదిని', 'సుమనోరమ' యను రెండు నాటకసంఘములను స్థాపించి విద్యావంతులగు నటులను చేర్చుకొని యా నాటకముల నభినయింపఁ జేసిరి. ఆజీవమానము ఇదే ప్రధాన కార్యముగా, తక్కిన పనులన్నియు గౌణముగా నేర్పఱుచుకొని వర్తించిరి.

ఇట్లు వీరి నాటకములకు స్వరూపము నిచ్చిన ముఖ్య తత్త్వములు మూఁడు: (౧) ప్రాచ్య పాశ్చాత్య నాటక పద్ధతులు, (౨) తమ నాటకములను తామే యాడింపవలసిన భారము, (౩) జనులకు నీతిని బోధింపవలయు నను నుద్దేశము.

(౧) ప్రాచ్యులకును, పాశ్చాత్యులకును నాటకరచనలో తత్త్వమునం దంతగా భేదము లేదు. ఇరువురును ముఖ్యముగా రసోపాసకులే. కాని పరిభాషయందు కొంత భేదము గలదు. మనలో రూపకములు మొదటినుండియు గద్యపద్యమిశ్రమములు. సామాన్య సల్లాపమునకు గద్యము నుపయోగించి, భావము తీక్ష్ణమైనచోట పద్యముల నుపయోగించుట సంస్కృత నాటక కర్తల పద్ధతి. కేవల గద్య రూపకములు గాని, పద్య రూపకములు గాని నే నెఱిఁగినంతలో వారిలో లేవు. పాశ్చాత్యులందును ఇట్టి మిశ్ర రచనలు లేకపోలేదుగాని మొత్తముమీఁద వారి రచనలు వట్టి పద్యముననో గద్యముననో రచింపఁబడి యుండును. ఇటీవల వారిలో పద్యరూపకముల వాడుక తప్పిపోయినది. ఇప్పు డట్టివి వ్రాయువారే యరుదు. మనలో అంకములను 'రంగములు' గా చీల్చు వాడుక లేదు. వారిలోఁ గలదు. భగవత్ప్రార్థనా రూపమగు నాందితోఁ గూడిన ప్రస్తావన మన నాటకముల కెల్ల మొట్టమొదట నుండును. వారు కేవలము కథాభాగముతోనే మొదలుపెట్టుదురు. యుద్ధము, చావు మొదలగువానిని వారు ప్రత్యక్షముగా చూపుదురు.

మనవారు చూపరు; సూచింతురు. ప్రతి ప్రధానపాత్రమును క్రొత్తగా రంగస్థలమునకు వచ్చుటకు ముందో, వచ్చిన యుత్తరక్షణముననో దానినిగూర్చిన పరిచయము సభ్యులకుఁ గల్గునట్లు సూచించుట ప్రాచీనపద్ధతి. పాశ్చాత్యులలో ఇది యంతగా పాటింపఁ బడదు. మనవారు కేవల శోకపర్యవసానముగల కథల గ్రహింపరు. వారిలో నట్టి వెక్కువ. ప్రధాన పాత్రములను కేవలము ఉత్తమములుగానో, నీచములుగానో తయారుచేయుట సంస్కృతమువారి దారి. ఉత్తమపాత్రములందు దుర్గుణములను, నీచపాత్రములందు సుగుణములను కొంచెముగా నైనను కలిపి సృజించుట పడమటి కవుల మార్గము. ఇంకను కొన్ని చిల్లర సంకేత భేదములు గలవు. 1

రెండు పద్ధతులను చక్కఁగా నెఱిఁగినవారు గావున మన కవులు పై రెంటి నుండియు కొంత గ్రహించి, కొంత వదలి నూతనమార్గము ద్రొక్కు స్వాతంత్ర్యమును వహింపఁ గల్గిరి. ప్రాచ్యపద్ధతి వట్టి చాదస్తమని తిరస్కరించు నవివేకము గాని, పాశ్చాత్య పద్ధతి యశాస్త్రీయమని యసహ్యపడు మొఱకుఁ దనముగాని వారి కుండలేదు. కాని వట్టి స్వాతంత్ర్య సాహసమునే మెచ్చుకొని వీరపూజ చేయుట ప్రకృతము మనపని కాదు. మనము స్వార్థపరులమని మొదలే చెప్పితిని. ఆ స్వాతంత్ర్యమును వా రెట్లు ఎంత యుపయోగించిరి? దాని ఫలము మన కెంత? అనునదియే యిప్పటి మన చింత.

వారి కాలమున కప్పుడే ఆంగ్లవాఙ్మయములో పద్య నాటకములు మూలఁబడి గద్య నాటకములే యెక్కువగా వ్యాప్తియం దుండెను. అట్టిచో 'వారిలో కేవల పద్యరూపకములును, గద్యరూపకములును ఉన్నవే! మనలో లేవే!' యని మాత్రము చింతించి మన కవు లిరువురును అట్టి రచనలకు పూనుకొనక పోవుట నాకుఁ జూడఁగా మన భాగ్యమే. వట్టి పద్యములే కాక ఆద్యంతము పాటలతోనే నిర్వహింపఁబడు 'ఒపేరా' లనఁబడు వింత రూపకములు వారిలోఁ గలవు. అవి వారి చాదస్తములకుఁ జేరినవి. ఆ వాతలే పెట్టుకొని మన వా రొకరిద్దరు పద్యనాటకములు వ్రాసినా వా రున్నారు గాని ఆ

వెట్టి యంతటితో నిలిచిపోయినట్లు తోఁచుచున్నది. 'ఒపేరా' ల ప్రతిబింబములను తయారుచేయుటకు మనలో నెవరును చేయి వేసినట్లు కానరాలేదు. తీవ్రభావములను వివరించుటకు గద్యము చేతఁగానప్పుడు పద్యమును, పాటయు పనికివచ్చునే కాని యాద్యంతము దానినే కలిపికొట్టుట నాటకము నందు ప్రధానమైన వాచికాంగికాభినయములకు తిలోదక మిచ్చినట్లే. ఆంగికాభినయమునకు వేషభూషణాదు లెట్టివో వాచికాభినయమునకు పద్యమును, పాటయు, గద్యమును అట్టివి. పాత్రములను, సమయసందర్భములను ఎఱిఁగి తగినట్లు మార్చుకొనవలసినవి. అట్లుగాక, వినుటకు చదువుటకును ఇంపుగా నుండునని పద్యమో, పాటయో మొదటి నుండి తుదివఱకు ప్రయోగించుట ధర్మవరము సరిగంచు చీర చూచుట కందమని పాత్రములందఱును ధరించినట్లగును గాని వేఱుకాదు. మన కవు లిద్దఱును పై మూఁటిని యథాయోగముగా నుపయోగించి తమ రూపకములను చాల రసిక జనాహ్లాదకములుగా నొనరించిరి. ఐనను ఇద్దఱకును పాటల యందలి యభిమానము కొంత దాక్షిణ్య గర్భముగానే కానవచ్చుచున్నది గాని వానిని ప్రయోగించుటలో తగినంత ధైర్యము వారి కుండినట్లు తోఁపదు. పామరజన తృప్తికై పాటలు వ్రాయవలసి వచ్చినట్లే యిరువురును చెప్పుకొన్నారు. కాని కృష్ణమాచార్యులు ఒక 'అజామిళచరిత్రము'న దప్ప నేనెఱిఁగిన యన్నినాటకములందును పాటలు వ్రాయక మానలేదు. మఱియు 'ప్రహ్లాద'లో ప్రహ్లాదుని నోటిపాటలను 'ఆ గేయముల రచనావిశేషమును అద్భుతముగా నున్నది. నూతన ఫక్కి విలసిల్లుచున్నది' ('ప్రహ్లాద' పు.౨౪) అని హిరణ్యకశిపునినోట పొగడించుచు కవి తన పాటలరుచిని తానే పరోక్షముగా ప్రశంసించినట్లు తోఁచుచున్నది. శ్రీనివాసరాయల నాటకములలో నైదాఱు మాత్రము పాటలు లేకున్నవి. వారు వ్రాయనేలేదో, లేక యచ్చువేయలేదో తెలియదు. ఇరువురును వ్రాసిన పాటలనుగూడ గ్రంథమధ్యమందు అచ్చులో వానివాని చోటులఁ జేర్పక, కులముచెడినవారికి కూడుపెట్టినట్లు, మడుగు గ్రంథమంతయు ముగిసిన తరువాత తుదలో నతికించి పొమ్మన్నారు! ఏమి ప్రాయశ్చిత్తము పెట్టుకొన్నవో కాని యొకటి రెండు పాట లీబహిష్కారమునకుఁ దప్పినవి.

('చిత్రనళీయం' అం. ౩, రం. ४.) కొన్నిపాటలు, పద్యములు వేషమునకును పనికివచ్చునవియై పంక్తికి నర్హములైనవి. పాటలయందు వీ రిద్దరికిని ఈ సవతితల్లి మక్కువ యేల కలిగినది? సంగీతమునం దిరువురును మంచి పరిచయముగల రసజ్ఞులు. కాని వారికినీ దెలియకయే గాయకులు మనుష్యజాతిలో నొకమెట్టు తక్కువయను ప్రాచీనభావము వారిని వదలక యంటియుండెనేమో! లేక పాట యందుకొన్న వెంటనే నటులు తమ నటకత్వమును మఱచి సంగీతగాండ్రై పోయి నాటకమును కచ్చేరీ క్రిందికి దింతురను భయము వారి కుండెనో! శ్రీనివాసరాయల నాటకపు పాటలు నే వినియుండలేదు. కృష్ణమాచార్యులవి కొన్ని విన్నాను. వారి కీర్తికిని, వ్యాప్తికిని పద్యము లెంతో అంతే పాటలును గారణము లగునని మాత్రము చెప్పక తప్పదు. ఇదిగాక కృష్ణమాచార్యులకు పద్యములుగూడ లేని గద్యనాటక మందే అభిమాన మెక్కువ యుండెననియు, దాని కుదాహరణముగా ఒక పద్యమైనను లేని 'అజామిళచరిత్రము' వారు రచించిరనియు, వారు ఇతర నాటకములలో పద్యములు వ్రాయుటకు తత్కాలపు జనుల యభిరుచియే కారణమనియు ఒకానొక విమర్శకులు వ్రాసిరి ('రోషనార' పీఠిక). ఏమో! చెప్పలేను. కాని యజామిళచరిత్రమున పోతన్న భాగవతము నుండి యెన్నియో పద్యము లెత్తి కడపటియంకమందు చేర్పఁబడినవి. కృష్ణమాచార్యులు సొంతముగా రంగముమీఁద నభినయించుటను జూడఁబడసిన పుణ్యాత్ములు, పద్యములను రసానుగుణముగాఁ జెప్పుటలో వారివంటి నటులు లేరని చెప్పఁగా విన్నాను. ఎట్లును శ్రీనివాసరాయల నాటకముల కంటె కృష్ణమాచార్యుల వానిలో పద్యములు తక్కువ. మనస్సులలో నెట్టి యభిప్రాయ మున్నను ఇరువురు కవులును పద్యములను, పాటలను యథేచ్ఛముగా వాడినారనుట ప్రకృతము మనకుఁ గావలసినది.

అట్లు వాడునప్పుడు అనేక స్థలములందు చాల అపురూపముగా పాట పద్యముల రచన అతుకుకొని యందమై యున్నను, ఎన్నో స్థలములందు వాని యావశ్యకత లేకున్నను, అవి కూర్పబడినవని చెప్పవలసియున్నది. భావములకు తీవ్రత లేనిచోట అవి

